# ఉద్ధవగీత

## భాగవతం నుండి

- సముద్రాల దశరథీ





ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.



గురుదేవులు మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు

# ముందుమాట

మనది వేదభూమి. వేదాలను విభజించినవాడు వేదవ్యాసుడు. ఆ వ్యాసుడే మహాభారతాన్ని రచించాడు. అయినా తన రచనలతో ఆయనకు మనశ్శాంతి కలగలేదు. తర్వాత నారదప్రేరణతో భాగవతాన్ని రచించాడు. అప్పుడు ఆయన కృతకృత్యుడై సంతృప్తి చెందాడు.

భారతంలో అంతర్భాగమే భగవద్గీత. అదేవిధంగా భాగవతంలో అంతర్భాగం ఉద్ధవగీత. భారతంలో ఇంకా చాలా గీతలు కలవు. అయితే భగవద్గీతకు లభించిన గొప్పస్థానం ఏ ఇతరస్వతంత్రగీతలకూ లభించలేదు.

భగవద్గీత తర్వాత దాదాపు అంతటి స్థానం ఉద్ధవగీతకు దక్కింది. ఇది భాగవతం పదకొండవస్కంధంలో వుంది. ఇది కృష్ణుడు ఉద్ధవుడు ఇద్దరి మధ్య జరిగిన సంవాదం. 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అన్నట్లు పరిపూర్ణావతారమైన శ్రీకృష్ణుడు ఇచ్చిన చరమసందేశం ఉద్ధవగీత. ఉద్ధవుడు జిజ్ఞాసు భక్తుడు. 'ఉత్ రుణోతి దుఃఖం ఇతి ఉద్ధవః' దుఃఖమును పోగొట్టువాడు ఉద్ధవుడు. తనయొక్క సంశయనివారణ చేసుకుంటూ మనలోని అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానాన్ని కలుగజేసేవాడు ఉద్ధవుడు.

నేను బాల్యవిద్యను శ్రీవ్యాసాశ్రమంలో అభ్యసించాను. అక్కడ గురుకులం స్థాపించి నాబోటివారికి ఎందరికో సంస్కృతాధ్యయనావకాశం కలిగించిన మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారికి నా కృతజ్ఞతాపూర్వక ప్రణామాంజలి.

"ఉద్ధవగీతలో ఆధునికములు మరియు ఆధ్యాత్మికములైన విషయాలు చాలా వున్నాయి. వాటిని నీవు సరళమైన తెలుగులో రచించు" అని ప్రోత్సహించి 'సద్గురువాణి' అనే త్రైమాసికపత్రికలో సీరియల్ గా ప్రకటింపజేయడమేగాక ప్రూఫులు కూడా వారే దిద్ది, నన్ను ఎంతగానో ప్రోత్సహించిన శ్రీనైనారు అప్పాస్వామిగారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఈ గ్రంథంలో నా ఆంధ్రీకరణను, భాషను చక్కదిద్దడమే కాక నా

బాల్యంనుండి నన్ను ఈ సారస్వతవిషయంలో ఒక సద్గురువు గా ఆశీర్వదిస్తున్న మా పినతండ్రి డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారికి నా మనఃపూర్వకప్రణామములు.

జగద్విఖ్యాత అవధాన చక్రవర్తి, నిరంతర సాహితీ పరిశోధకులు అన్నమాచార్యప్రాజెక్ట్ డైరెక్టర్ డా॥ మేడసాని మోహన్ గారు తమ అభిప్రాయాన్ని అభినందన రూపంలో తెలియజేసినందులకు నా కృతజ్ఞతలు.

అడిగిన వెంటనే సౌమనస్యము అను పేరుతో తన అభిప్రాయమును వ్రాసి ఇచ్చిన సాహితీ సముద్రులు, నిగర్వి డా॥ మల్లేల గురవయ్య గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

'సద్గురువాణి' త్రైమాసిక ఆధ్యాత్మిక పత్రికలో ఉద్ధవగీతను సీరియల్ గా ప్రచురింపజేసి నన్నునుగ్రహించిన పూజ్యశ్రీ విద్యాస్వరూపానందస్వామివారికి నా కృతజ్ఞతలు.

ముఖచిత్రాన్ని అందంగా చిత్రించిన మిత్రుడు శ్రీగుణభూషణ్ గారికి, అందుకు తగు సూచనలిచ్చిన హితైషి, సహోద్యోగి శ్రీ యస్.బి.యస్. పాటి గారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథముద్రణకు "ఆధ్యాత్మిక గ్రంథప్రచురణకు రచయితలకు ఆర్థికసహాయపథకం" క్రింద ఆర్థికసహాయాన్నందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారి యాజమాన్యమునకు కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాను.

– డా॥ సముద్రాల దశరథ

# నివేదన

వేదమే ఒక కల్పవృక్షం. అందుండి జారిపడిన పండే శ్రీమద్భాగవతం. అందులో ఆత్మోన్నతి కలిగించే ఆధ్యాత్మికవిషయాలు కోకొల్లలుగా వున్నాయి.

పన్రెండు స్కంధాలు గల శ్రీమద్భాగవతంలోని పదకొండవ స్కంధం ఇతరస్కంధాలకు లేని విశిష్టతను సంతరించుకున్నది. ఇందుకు కారణం ఉద్ధవుణ్ణి ఉద్దేశించి శ్రీకృష్ణభగవానుడు కావించిన తత్త్వప్రబోధమే.

మహాభారతంలో భగవద్గీతకు ఎంత ప్రాముఖ్యమున్నదో, భాగవతంలో ఉద్ధవగీతకు అంత ప్రాముఖ్యమున్నది. భగవద్గీతలో వలెనే ఇక్కడ కూడా శ్రీకృష్ణుడే వక్త. అక్కడ శ్రోత అర్జునుడు కాగా ఇక్కడ యదువంశానికే చెందిన ఉద్ధవుడు.

ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అనే నాలుగు రకాల భక్తులలో రెండవకోటికి చెందినవాడు ఉద్ధవుడు. బ్రహ్మవిద్య జిజ్ఞాస కలవారికి మాత్రమే బోధింపదగియున్నది. తెలుసుకోవాలన్న కోరికనే జిజ్ఞాస అంటారు. అట్టి జిజ్ఞాస పరిపూర్ణంగా కలిగిన ఉద్ధవుడు శ్రోత కావడం వల్ల ఈ ఘట్టానికి ఎంతో ప్రాధాన్యం కలిగింది.

ఇందులోనూ అవధూతోపాఖ్యానం వంటి విషయాలు చాలా ముఖ్యమైనవి. భగవద్విభూతుల వర్ణన కూడా ఇందులో వున్నది. తన దివ్యావతారం అంతిమదశలో భగవంతుడు చేసిన ప్రబోధం కాబట్టి భగవద్గీతకంటె కూడా ఉద్ధవగీతకు ప్రత్యేకవిశిష్టత ఉన్నదని చెప్పవచ్చు.

ఉద్ధవగీతను సరళమైన తెలుగులో అనువదించి మూలంతో సహా ఈ గ్రంథాన్ని ఇలా వెలువరించడానికి కృషి చేసిన చిరంజీవి డా॥ సముద్రాల దశరథను మనసారా అభినందిస్తున్నాను. దీనికి ఆర్థికసహాయాన్నందించిన తిరుమల తిరుపతి దేవస్థానంవారు కూడా అభినందనీయులే.

**– డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

తిరుపతి.

# అభినందన

భారతీయ వాఙ్మయంలో శ్రీమద్భాగవతం మిక్కిలి ప్రాశస్త్యం వహించిన పురాణేతిహాసం. ద్వాపరయుగంలో ధర్మసంస్థాపనకై అవతరించిన శ్రీకృష్ణభగవానుని లీలావిభూతి ఎటువంటిదో భాగవతం ద్వారా విశదమౌతుంది. మానవుడు తన అంతరాంతరాలలో చెలరేగే అనేక భావోద్వేగాలకు, కామక్రోధాదివికారాలకు తగిన ఉపశమనాన్ని పొందగలగాలి. అంటే అధ్యాత్మ చింతనతో కూడిన ఆత్మబలం చాల అవసరం. ఇటువంటి ఆధ్యాత్మ చింతనతో కూడిన విజ్ఞానసముపార్జన 'ఉద్ధవగీత' అధ్యయనంతో పొందవచ్చు. శ్రీకృష్ణభగవానునికి అంతరంగికుడు, చెలికాడునైన ఉద్ధవునికి తన అవతారం పరిసమాప్తం కాబోతూ ఉండగా బోధించిన ఆధ్యాత్మప్రబోధమే ఉద్ధవగీత. మహాభారతంలో అర్జుననకు ప్రబోధించిన విజ్ఞానం భగవద్గీతగా ప్రసిద్ధి గాంచింది. భాగవతంలోని ఈ ప్రబోధం ఉద్ధవగీతగా ప్రసిద్ధిపొందింది. ఈ ప్రబోధాన్ని భగవంతుడైన శ్రీకృష్ణుడు తాను ఎవరికి సెలవిచ్చాడో, ఆ చెలికాని పేరుతోనే జగద్వ్యాప్తం కావడానికి సంకల్పించడంలో ఆ స్వామి యొక్క నిర్హేతుకమైన దయారసం ద్యోతమానమౌతుంది.

నిరంతర అభ్యాసంతో కూడిన ధ్యానయోగంతో జీవుడు తన అంతరంగములో ఎంత స్వచ్ఛత, పరిణతి సాధించే అవకాశం ఉన్నదో, సత్త్వగుణాన్ని ప్రవర్ధమానం చేసుకొని జీవుడు తన మనోవికారాలను ఎలా నిర్మూలింపగలడో – ఇత్యాది అంశాలన్నీ ఉద్ధవగీత విపులంగా పేర్కొంటుంది.

అటువంటి ఈ ఉద్ధవగీతను ప్రసన్నమైన శైలిలో, సుబోధ్యమైన రీతిలో సంగ్రథనం చేసిన చిరంజీవి దశరథ మిక్కిలి ప్రశంసాపాత్రుడు. అత్యంతగహనమైన వేదాంత సంబంధిత విషయాలను కూడ తన సరళమైన భాషా పటిమతో, భావజాలంతో ఈ గ్రంథంలో సత్యసుందరంగా దశరథ ఆవిష్కరించినాడు. పరిశోధనాత్మకమైన రీతిలో గూడ సాగిన ఇతని రచనా ద్రఢిమ మిక్కిలి ప్రశంసార్హం. ప్రాణాయామమునకు సంబంధించిన అంశాలుకానీ, ఇతరత్రా గహనంగా ఉండే అధ్యాత్మ విషయాలు కూడ దశరథ ప్రసన్నవ్యాఖ్యానధోరణితో పాఠకులందరూ స్పష్టంగా తెలుసుకునే రీతిలో విశదీకరించినాడు.

ఈ చిరంజీవి రచనావ్యాసంగం అభ్యుదయపరంపరాభివృద్ధిగా సాగుతూ ఉండాలని ఆకాంక్షిస్తూ అభినందిస్తున్నాను.

– డా॥ మేడసాని మోహన్

డైరెక్టర్, అన్నమాచార్యప్రాజెక్ట్, తి.తి.దే.

# సౌమనస్యము

డా॥ సముద్రాల దశరథను అతని బాల్యము నుండి నేనెఱుగుదును. ఎంతో కష్టపడి చదివి, నేడు తిరుమల తిరుపతి దేవస్థానమువారి పురాణ ఇతిహాస ప్రాజెక్టులో పనిచేయు చున్నాడు. తాను శ్రీమలయాళస్వామి కృతులపై సిద్ధాంతవ్యాసము వ్రాసి డాక్టరేట్‌ను పొందుటయే గాక తన ప్రవృత్తికి అనుగుణముగా నిరంతర పరిశోధనకు సంబంధించిన రంగములో వృత్తిని నిర్వహించుట ప్రశంసార్హము. తి.తి.దే. భాగవత గ్రంథ పరిష్కరణలో ముఖ్యపరిష్కర్తకు సహాయకుడుగా తాను పొందిన అనుభవము 'ఉద్ధవగీత' రచనకు ఎంతో దోహదము కలిగించినది. అనగా స్వార్థము తీర్థమేకమయి ఒక లోకకల్యాణకారకమైన అనువాదగ్రంథము ఆవిర్భవించినది.

ఆధ్యాత్మిక తత్త్వ ప్రతిపాదకములైన గీతలన్నింటిలో భగవద్గీత మకుటాయమానము. జగద్గురువైన శ్రీకృష్ణుడు అర్జునుని నిమిత్తమాత్రునిగా గైకొని కావించిన భగవద్గీతాశాస్త్రములో ధర్మసంస్థాపనార్థకమైన కర్తవ్యనిష్ఠ ప్రబోధాత్మకముగా ప్రతిపాదితమైనది. జయనామాంతర భారతమధ్య భాగములోని గీత నాయకమణివలె భాసించి, సమస్త మానవాళికి విధ్యుక్త ధర్మమును చాటినది. ఇక సందర్భానుసారముగా ఉత్తరగీత, శివగీత వంటివి ఎన్నో లెక్కలేనన్ని వెలువడినవి.

భాగవతపురాణములో కథాసందర్భమును బట్టి భ్రమరగీతము, గోపికాగీతములు, వంటిగీతలెన్నో వెలసినవి. భగవద్గీతకు కుడియెడములుగా నిలువ దగిన ఉద్ధవగీత శ్రీకృష్ణావతార పరిసమాప్తికి ముందు ఆయన అంతిమోపదేశముగా భాగవతమున కూర్పబడినది. శ్రీకృష్ణుని తొలిసందేశమునకు ఈ చివరి సందేశమునకు గల సందర్భములు పూర్తిగా భిన్నమైనవి. ఉద్ధవగీతలో భగవద్గీతలోని కొన్ని విషయములు సూచనామాత్రముగా ఉన్నప్పటికి, ఉద్ధవునికి కలిగిన సందేహనివృత్తిలో కృష్ణుడు పాటించిన విధానము ఎంతో వినూత్నముగా ఉన్నది. బద్ధపురుషునికి ముక్త పురుషునికి గల వ్యత్యాసము ముఖ్యముగా ముక్తపురుషలక్షణములు వివరణాత్మకముగా ఉద్ధవగీతలో స్పష్టీకరింపబడినవి. ఇందు యదువునకు దత్తాత్రేయుడు చెప్పిన గీతకూడ అవధూత గీతగా వివరింపబడినది. ఇంతేగాక పింగళోపాఖ్యానమువంటి సన్నివేశములతో ఉద్ధవగీత ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది.

ఉద్ధవుని అభ్యర్థనపై ఉపదేశింపబడిన ఈగీతకు భాగవతమునగల స్థానము ఎంతో విశిష్టమైనది. ప్రియ మిత్రుడు, సేవాధర్మముగల వినయమూర్తి ఎంతో ఆసక్తితో, జిజ్ఞాసువై అర్థించినప్పుడు అతని మనస్సునెఱిగి, మఱెట్టి కొఱత అతనిలో లేకుండ జేయవలసిన బాధ్యతను కృష్ణుడు ఎంతో సామరస్యముతో సౌమనస్యపూర్వకముగా నిర్వహించినాడు. శ్రీకృష్ణబోధామృతము పేర ఉద్ధవగీత ఇంతకు మునుపు పుస్తకరూపమున వెలువడినట్లు గుర్తు. కాని అది అంతప్రచారమునకు వచ్చినదికాదు. ఇది ఎల్లరు పఠింపఁదగినది. మూలముతోపాటు అనువాదమును కూడా ప్రచురించుటచే ఇది తప్పక బహుళప్రచారమును పొందితీరునని నా అభిప్రాయము.

త్రయీ :-

1) డా॥సముద్రాల దశరథ వ్రాసినట్టి
వ్యాస ముద్ధవగీత కేవలమొక యను
వాదమా? కాదు, ప్రజల కామోదయోగ్య
తత్త్వదీపిక; శ్రోత ఉద్ధవుడు నెపము ॥

2) కృష్ణు నంతిమసందేశ మింతవరకు
తెలుగులో మూలసహితమ్ము వెలువరించి
ఖ్యాతి గనినట్టి గ్రంథముల్ కానరావు;
ప్రస్తుత గ్రంథ మెంతయో ప్రస్తుతిఁగను ॥

3) అందఱుపఠించి సౌమనస్యమ్ముతోడ
నీదుకృషి మెచ్చి ఫలసిద్ధిమైందనర్తు
దశరథా! ధన్యుడవు సుమీ! త్వత్కృతి క్షితి
హితము మహితమ్ముముక్తిసహితము సతము ॥

డా. మల్లేల గురవయ్య
18-09-2008

# ఉద్ధవగీత

## ఒకటవ అధ్యాయము

(దేవతలు నిజధామమునకు పోవలసినదిగా భగవంతుణ్ణి ప్రార్థించడం – ప్రభాసక్షేత్రానికి పోగోరే యాదవులను చూచి ఉద్ధవుడు శ్రీకృష్ణుని చెంతకు వెళ్ళడం)

శుకుడు:– పరీక్షిన్మహారాజా! నారదమహర్షి వసుదేవునకుపదేశించి వెళ్ళిన తర్వాత బ్రహ్మదేవుడు తన పుత్రులతోను ఇంద్రాది దేవతలతోను, ప్రజాపతులతోను, సర్వభూత హితప్రదుడైన శివుడు భూతగణాలతోను ద్వారకానగరం చేరుకున్నారు.

మరుద్గణాలతో ఇంద్రుడు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, అశ్వినీ కుమారులు, ఋభువులు, ఏకాదశరుద్రులు, అంగిరసులు, విశ్వేదేవతలు, సాధ్యులు, దేవతలు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, సిద్ధులు, చారణులు, గుహ్యకులు, ఋషులు, పితరులు, విద్యాధరులు, కిన్నరులు అక్కడకు చేరారు. తన శరీరాకృతిచే మానవుల మనస్సులను రంజింపచేయువాడు, సర్వ లోకాల పాపాలను హరింపచేయువాడు అయిన శ్రీకృష్ణుని దర్శనం కోసం పైవారందరు ద్వారకానగరం చేరారు.

అనంతరం ఆ బ్రహ్మాది దేవతలు సర్వవిధ సంపదలతో భాసించే అద్భుతదర్శనుడైన శ్రీకృష్ణుని తనివి తీరని కళ్ళతో చూడసాగారు.

వారు నందనవనం, చైత్రరథం మున్నగు స్వర్గోద్యానములలోని దివ్యపుష్పాలతో జగదీశ్వరుడైన కృష్ణుని అలంకరించిన వారై చిత్ర విచిత్రాలైన పదాలతో, అర్థాలతో ఆయనను ఇలా స్తుతించారు.

దేవతలు:- దేవా! యోగులైన వారు కర్మబంధాలనుండి విడుదల బొందగోరి తమ మనస్సులో సదా ధ్యానించే నీ పాదపద్మాలను చూచి మేము మా బుద్ధీన్ద్రియప్రాణ మనోవాక్కులతో మీకు నమస్కరిస్తున్నాము.

నీవు త్రిగుణాలతో గూడి భావింపవీలుగాని ఈ ప్రపంచాన్ని సృష్టిస్తున్నావు, పాలిస్తున్నావు, సంహరిస్తున్నావు, అయినప్పటికి నిన్ను కర్మదోషాలు అంటడంలేదు. నీవు నిరావరణమైన నీ నిజస్వరూపంలో పరమానంద మగ్నుడవై వున్నావు.

విమలమైన నీ కీర్తిని శ్రద్ధతో వినడం వల్ల సత్పురుషులు శుద్ధులవుతున్నారు. ఈ శుద్ధిని దురాశాపరులైన మానవులు వేదాధ్యయనం, దానం, తపస్సు మొదలగునవి ఆచరించినా పొందలేరు.

మునులు ఆర్ద్రహృదయంతో వేనిని స్మరిస్తున్నారో, ఆశ్రితులగు భక్తులు సమానైశ్వర్యములు బొందడానికై వాసుదేవాది చతుర్వ్యూహ రూపంలో వేనిని ఆరాధిస్తున్నారో జితేంద్రియులైన ధీరులు స్వర్గాన్నతిక్రమించి వైకుంఠప్రాప్తికై త్రికాలాలలో వేనిని పూజిస్తున్నారో అట్టి నీ పాదపద్మాలు మా విషయవాసనలకు ధూమకేతువగు గాక!

యజ్ఞం చేసేవారు వేదత్రయోక్తమగు విధిచే సంయతములైన చేతులతో హవిర్భాగాన్ని గ్రహించి యజ్ఞకుండంలో ఆహుతులనిచ్చి వేనిని స్మరిస్తున్నారో, అణిమాద్యష్ట సిద్ధులను బొందదలచి ఆధ్యాత్మయోగంచే యోగులు వేనిని ధ్యానిస్తున్నారో, పరమభాగవతులు వేనిని అంతటా అర్చిస్తున్నారో అట్టి నీ పాదపద్మాలు మా విషయవాసనలను దహింపజేయుగాక!

నేను హృదయంలో నివసించుచుండగా సపత్నివలె ఈ వాడిపోయిన

వనమాల ఏమిటి అని లక్ష్మి ఈర్ష్యపడుతున్నది. అయినా నీవా విషయాన్ని లెక్కపెట్టక భక్తులిచ్చే ఈ మాలలను స్వీకరిస్తున్నావు, నీ భక్తవాత్సల్యంతో మా విషయవాసనలు నశించుగాక!

వామనావతారంలో బలిచక్రవర్తి ఇచ్చిన భూమిని కొలవడానికి నీవెత్తిన పాదము త్రిలోకాలలోను వ్యాపించు విజయధ్వజం లాగా వుండినది. ఆ పాదాలనుండి పుట్టిన గంగాదేవి పతాకవలె శోభిల్లింది. అలాంటి నీ పాదాలు రాక్షససైన్యానికి భయాన్ని, దేవసేనకు భయరాహిత్యాన్ని గలుగజేశాయి. సాధుస్వభావులు వైకుంఠాన్ని, దుష్టులధోగతిని పొందుటకు నీపాదాలే కారణములగుచున్నవి. అలాంటి నీ పాదపద్మాలు భజించే మా పాపతాపాలను తొలగించుగాక!

పరస్పర కలహ పీడితులగు జీవులు ముక్కుత్రాళ్ళు వేయబడిన పశువులవలె కాలపురుషుని యధీనంలో వున్నారు. ఆ కాలపురుషడవు నీవే. అట్టి పురుషోత్తముడవైన నీ చరణ కమలాలు మాకు సుఖములు కలుగచేయుగాక!

వేదాలు నిన్ను ప్రకృతి పురుషులకు నియంత్రకుడవని కీర్తిస్తున్నాయి. కావున నీవే సృష్టిస్థితి లయ కారకుడివి. శీతగ్రీష్మవర్షాకాలాలను నాభిత్రయంతో (చాతుర్మాస్యత్రయంచే) జగత్తునంతటిని సంహరించు కాలమునీవే, నీవే పురుషోత్తముడవు.

అమోఘవీర్యుడగు మహావిష్ణువు నీవలన శక్తిని పొంది మాయతో గూడి ఈ జగత్తులో బీజస్వరూపమైన మహత్తత్త్వమును సృష్టిస్తున్నాడు. తర్వాత ఆ తత్త్వం త్రిగుణమయమగు మాయననుసరించి ఏడు ఆవరణలు గలిగిన ఈ సువర్ణమయమగు బ్రహ్మాండమును సృష్టిస్తున్నది.

మాయచే ఆవరింపబడిన ఇంద్రియసమూహంచే ప్రాప్తమైన విషయాలనుభవించినా నీవు వానిలో ఆసక్తి కలిగివుండవు. అందుచేత నీవే స్థావరజంగమాలకు అధీశ్వరుడవు కాని ఇతరజీవులు స్వయంగా పరిత్యజించినా ఆ విషయభోగాలకు భయపడుతున్నారు.

పదహారువేలమంది భార్యలు నిన్ను వెంటాడుతుంటారు. వారు మందహాసాలతో, కమనీయమైన చూపులతో, మనోహరములైన కనుబొమల సంజ్ఞలతో, సురతాలాపాలతో మన్మథబాణాలను నీపై ప్రయోగిస్తున్నారు. ఆ మన్మథబాణాలు నీ మనస్సునేమాత్రం వశం చేసుకోలేకపోతున్నాయి.

మూడు లోకాలలో పాపప్రక్షాళన చేయుటకు నీవు రెండు పవిత్ర నదులను ప్రవహింపచేసినావు. ఒకటి నీ లీలలతో నిండిన అమృతమయ కథానది. రెండవది నీపాదప్రక్షాళన జలంతో నిండిన గంగానది. వివేకవంతులు శ్రవణంద్వారా నీకథానదిలో, శరీరంచే గంగానదిలో స్నానం చేసి రెండు తీర్థాలను సేవిస్తూ తమ పాప తాపాలను నశింప చేసుకుంటున్నారు.

శుకుడు:- పరీక్షిన్మహారాజా! సర్వదేవతలతో, శంకరునితో గూడి బ్రహ్మదేవుడిలా కృష్ణుణ్ణి స్తుతించాడు. తర్వాత వారు తమ తమ ధామాలకు పోదలచి ఆకాశంలో వుండి భగవంతునికి నమస్కరించి ఇట్లన్నారు.

బ్రహ్మ:- ప్రభో! భూభారాన్ని తగ్గించడానికి అవతరించవలసిందిగా మొదట మేము నిన్ను ప్రార్థించాము. ఆ విధంగానే నీవు కూడా ఆ కార్యాన్ని నెరవేర్చావు.

నీవు సత్యాన్వేషకులగు సత్పురుషుల క్షేమంకోసం ధర్మాన్ని స్థాపించి అన్నిలోకాల్లోని పాపాన్ని నశింపజేయు కీర్తిని దిక్కులలో వ్యాపింపచేశావు.

నీవు యదువంశంలో అవతరించావు. సర్వోత్తమ రూపం ధరించావు. ఈ జగత్తుకు మేలు చేయుటకు ధైర్యసాహసాలతో కూడిన ఎన్నో పనులు చేశావు

కలియుగంలో నీ చరితను ఎవరు శ్రవణ కీర్తనలు చేసినా సులభంగా అజ్ఞానాంధకారాన్ని దాటగలరు.

నీవీ యదువంశంలో జన్మించి నూట ఇరవై అయిదు సంవత్సరాలు గడిచాయి.

సర్వాధారా! నీవిపుడు చేయవలసిన పని పూర్తి అయింది. బ్రాహ్మణుల శాపంవల్ల నీవంశం నష్టప్రాయమయింది.

అందువల్ల ఉచితమని తోచినచో నీవు నీ పరమ ధామమునకు ప్రవేశించుము. నీ సేవకులైన మమ్ము, మా లోకాలను కాపాడుము.

భగవంతుడు:- ఓ బ్రహ్మదేవా! నీవు చెప్పింది సత్యమనే అనుకుంటున్నాను నేను మీ పనులన్నీ పూర్తిచేసి భూభారం తొలగించాను. ప్రస్తుతం యదువంశం వీర్యశౌర్యాలతో మదించివుంది. భూమినంతా కబళించాలని భావిస్తున్నది. సముద్రాన్ని చెలియలికట్టలాగా నేను యదువంశాన్నాపి వున్నాను. మదమత్తమైన ఈ యదువంశాన్ని అంతటిని సంహరింపక నేను నా ధామానికి వెడలినచో ఇది తన హద్దుదాటి సర్వలోకాలను నాశం చేస్తుంది. అనగా! ఇపుడు బ్రాహ్మణుల శాపంవల్ల యదువంశ నాశనం ప్రారంభమైంది. ఇది పూర్తి అయినాక నేను నీలోకం గుండా వైకుంఠానికి పోతాను.

శుకుడు:- రాజా! లోకనాథుడైన శ్రీకృష్ణుడు ఇలా చెప్పగా బ్రహ్మదేవుడాయనకు నమస్కరించి దేవతలతో కలిసి తన ధామానికి వెళ్ళాడు.

తర్వాత ద్వారకానగరంలో చాలా అపశకునాలు కనబడ్డాయి. వాటిని జూచి యదువంశంలోని పెద్దలు శ్రీకృష్ణుని కడకు వచ్చారు. వాళ్ళతో కృష్ణుడిలా అన్నాడు.

భగవంతుడు:- పెద్దలారా! ప్రస్తుతం ద్వారకలో ఎటుచూచినా చాలారకాల ఉత్పాతాలు కనబడుతున్నాయి. బ్రాహ్మణులు మనవంశానికి పెట్టిన శాపాన్ని తప్పించలేము. ప్రాణాలు కాపాడుకోవాలంటే మనమిక్కడ ఉండకూడదు. ఇక ఆలస్యం చేయకూడదు. మనం ఈ రోజే పవిత్ర ప్రభాసక్షేత్రానికి పోదాం. దక్షప్రజాపతి శాపంచేత చంద్రుడు క్షయరోగగ్రస్తుడై ప్రభాసక్షేత్రంలో స్నానంచేసి ఆ దారుణ క్షయరోగం నుండి ముక్తుడై కళావృద్ధి పొందాడు. మనం కూడా ప్రభాసక్షేత్రానికి పోయి స్నానం చేద్దాం. దేవతలకు పితరులకు తర్పణాలనిద్దాం. ఉత్తమ బ్రాహ్మణులకు అనేక పిండివంటలతో భోజనాలు పెట్టి దక్షిణలనిద్దాం. పడవ ద్వారా సముద్రాన్ని దాటిన మానవునిలా మనం గూడా వారి దయవలన ఈ ప్రమాదం నుండి బయటపడుదాం.

శుకుడు:- రాజా! భగవానుడు ఇలా చెప్పిన వెంటనే యాదవులందరు ప్రభాసక్షేత్రానికి పోవుటకు నిశ్చయించుకొని రథాలను సిద్ధంచేసారు.

ఉద్ధవుడు శ్రీకృష్ణభక్తుడు. అతడు యాత్రకు ప్రయాణమవుతున్న యాదవులను చూచి భగవదాజ్ఞ విని ఘోరాలైన అపశకునాలను చూచెడు జగన్నాయకుడైన శ్రీకృష్ణుని దగ్గరకు పోయి ఆయన చరణాలకు శిరసా నమస్కరించి ఇలా ప్రార్థించాడు.

ఉద్ధవుడు:- యోగేశ్వరా! నీవు దేవాది దేవులకధీశ్వరుడవు. నీ మహిమలు శ్రవణకీర్తనలు చేయుటవలన జీవులు పవిత్రులవుతారు. నీవు

సర్వశక్తి మంతుడవు. నీవనుకుంటే బ్రాహ్మణుల శాపం తొలగింపగలవు. కాని నీవు యదువంశాన్ని సంహరించి ఈ లోకాన్ని విడిచిపెట్టడానికి సిద్ధంగా వున్నట్లు నేను భావిస్తున్నాను.

కేశవా! నీ పాదపద్మాలు వదలి అరక్షణం కూడా నేనుండలేను. కాబట్టి నన్ను గూడా నీ ధామానికి తీసుకొనిపో. కృష్ణా! పరమ మంగళము, కర్ణపీయూషము అయిన నీ చరితామృతము పానంచేసిన మానవులు ఈ లోకంలో వున్న విషయవాసనలనన్నింటిని త్యజిస్తారు. పరుండునపుడు, కూర్చుండునపుడు, తిరుగునపుడు, నిలుచుండునపుడు, స్నానం చేయునపుడు, క్రీడించునపుడు, భోజనం చేయునపుడు, ఇతరకార్యాలు చేయునపుడు ప్రియుడవు ఆత్మస్వరూపుడవు అయిన నిన్ను భక్తులమగు మేమెలా విడువగలము? నీవు ధరించిన మాలను ధరించాము. నీవు పూసుకొనిన చందనాన్ని పూసుకొన్నాము. నీవు త్యజించిన వస్త్రాన్ని ధరించాము. నీ భుక్తశేషాన్ని భుజించిన దాసులము మేము. కాబట్టి నీ మాయను మేము తప్పక జయింపగలము. దిగంబరులు, ఋషులు, శ్రమణులు, ఊర్ధ్వరేతస్కులు, శాంతులు, సన్న్యాసులు, నిర్మలచిత్తులు బ్రహ్మచర్యాది కఠిన సాధనల ద్వారా బ్రహ్మలోకాన్ని పొందుతున్నారు.

మహాయోగీశా! మేమీ కర్మమార్గంలో అనగా ఇహలోకంలో సంచరిస్తున్న నీ భక్తులతో కలసి నీ కథలను కీర్తిస్తూవుంటాం.

నీ గతిని, హాస్యాన్ని, దృష్టిని, పరిహాసాన్ని, కర్మలను, ఉపదేశాలను స్మరిస్తూ కీర్తిస్తూ సంసారదుఃఖాన్ని అతిక్రమిస్తాం.

శుకుడు:– పరీక్షిన్మహారాజా! దేవకీ సుతుడగు శ్రీకృష్ణుని ఉద్ధవుడిలా ప్రార్థించాడు. అపుడు తనకత్యంత ప్రియుడైన ఉద్ధవుని చూచి కృష్ణుడిలా అన్నాడు.

## రెండవ అధ్యాయము

భగవంతుడు: – మహాభాగా! ఉద్ధవా! నామనసులో మాట చెప్పావు. అది అంతా సత్యమే. బ్రహ్మ, ఇంద్రుడు వారిలోకాల ద్వారా వైకుంఠానికి పోవలసిందిగా నన్ను కోరుతున్నారు.

భూలోకంలో దేవతలకు చేయవలసిన పనిని పూర్తిచేశాను. బ్రహ్మదేవుడు ప్రార్థింపగా దీనికోసమే నేను బలరాముడితో కలిసి అవతరించాను. బ్రాహ్మణ శాపంవల్ల కాలిపోయిన యదువంశం పరస్పరంవివాదంవల్ల నష్టపోతుంది. ఈరోజునుండి ఏడవరోజు సముద్రం ఈ పురాన్ని ముంచేస్తుంది. నేనీలోకాన్ని వదలిన వెంటనే ఇక్కడ అన్ని శుభాలు పోతాయి. అనతికాలంలో కలికాలం ప్రవేశిస్తుంది. కలియుగంలో జనులు అధర్మపరులైవుంటారు. కాబట్టి నేనుండని ఈ భూమిపై నువ్వుండకూడదు. నీవు నీ స్నేహితులను బంధుజనులను అందరిని వదలిపెట్టుము. నా మీద ప్రేమతో మనస్సువుంచి సమభావంతో స్వచ్ఛందంగా భువిపై విహరించు. మనస్సు, మాట, కళ్ళు, చెవులు మొదలగు ఇంద్రియాలతో గ్రహింపబడే ఈ ప్రపంచం మాయామయమని తెలుసుకో, విక్షేపానికి గురైన మనస్సు కలవానికి అనేక వస్తువిషయక భ్రమ కలుగుతుంది. ఆ భ్రమే గుణదోషయుక్తమైనది. ఈ గుణదోషాలకు లొంగిన మనిషి మనసులో కర్మ అకర్మ వికర్మ అనే భేదాలు పుడతాయి. ముందు నీవు నీ ఇంద్రియాలను వశం చేసుకో చిత్తవృత్తులు నిరోధించు. ఈ ఆత్మ నాయందే వున్నదని గ్రహించి తెలుసుకో. జ్ఞానవిజ్ఞానాలు కలవాడవై నీవు నీ ఆత్మానుభవంలో ఆనందమగ్నుడవై వుంటావు. సర్వదేవతాది శరీరధారులకు ఇష్టుడవవుతావు. కాబట్టి నిన్నేటువంటి విఘ్నాలు బాధింపవు. గుణాలకంటె దోషబుద్ధికంటె అతీతుడయిన పురుషుడు బాలునిలాగా

నిషిద్ధకర్మనుండి నివృత్తుడవుతాడు. కాని దోషబుద్ధితో కాదు. విధించబడిన కర్మచేసినా అతడు గుణబుద్ధితో చేయడు. అన్ని భూతాలకు మిత్రుడు, శాంతుడు, జ్ఞానవిజ్ఞాన నిశ్చయుడు అయిన పురుషుడు ఈ విశ్వం నా స్వరూపమని తెలిసికొంటాడు. అందుకే అతను మళ్ళీ ఈ జీవన్మరణ చక్రంలో తగుల్కోడు.

శుకుడు:- రాజా! భగవానుడు ఇలా చెప్పిన తర్వాత ఉద్ధవుడు తత్త్వజ్ఞానాన్ని తెలుసుకోవాలని ఆయనకు నమస్కారం చేసి ఇట్లన్నాడు.

ఉద్ధవుడు:- దేవా! నీవు యోగులకు కారణుడవు, యోగేశ్వరుడవు, యోగులకు ఆధారుడవు, నీవు మా శ్రేయస్సు కోసం సన్న్యాస లక్షణమైన త్యాగాన్ని చెప్పావు.

విషయాసక్తులు కోరికలను విడుచుట కష్టం. వారిలో కూడ భగవద్భక్తిలేనివారు ఇలాంటి వాటిని వదలుట అసంభవం అని అనుకుంటున్నాను. నేను చాలా మూఢుణ్ణి. మాయాకల్పితదేహంతో నాది నేను అనుకుంటున్నాను. నీవుపదేశించిన సన్న్యాసలక్షణాన్ని అనుసరించే విధంగా నీ భృత్యుడనైన నాకు వివరించు.

నీవు సత్యస్వరూపుడవు. స్వయంప్రకాశుడవు. ఆత్మ తత్త్వాన్ని చెప్పుటకు నువ్వు తప్ప ఇంకెవరూ లేరు. బ్రహ్మాదిదేవతలు కూడా నీమాయామోహితులే. వారి బుద్ధి మాయకు వశం. కాబట్టి పుత్రాది బాహ్యవిషయాలనే పరమార్థాలని భావిస్తున్నారు.

దుఃఖతప్తుణ్ణి, వైరాగ్యయుక్తుణ్ణి అయిన నేను, సర్వజ్ఞుడవు, శాశ్వతమగు వైకుంఠంలో నివసించువాడవు, నారాయణుడవు, నరసఖుడవు అయిన నిన్ను శరణు కోరుతున్నాను.

భగవంతుడు:- లోక తత్త్వవిచక్షణులైన మానవులు వివేకంతో కూడిన బుద్ధిబలంతో విషయవాసనలనుండి వాళ్ళను వాళ్ళు ఉద్ధరించుకొంటారు. పురుషుడు ప్రత్యక్షానుమానాల ద్వారా తన మంచిచెడులను నిర్ణయించుకోగల సమర్థుడు. కాబట్టి మనుషులకు తమ ఆత్మే గురువుగా వుంది. ధీరులు, సాంఖ్యయోగవిశారదులు అయిన పురుషులు ఈ జన్మలోనే సర్వశక్తి సంపన్నుడనైన నన్ను పూర్తిగా దర్శిస్తారు. ఏకపాది, ద్విపాది, త్రిపాది, చతుష్పాది, బహుపాది, అపాది మొదలగు అనేక ప్రాణులను నేను సృష్టించాను. వాటిలో మానవుడే నాకు ప్రియుడు. నా స్వరూపం కనపడకపోయినా జీవులు బుద్ధిబలంతో అనుమానబలంతో ప్రకాశ స్వరూపుడనైన నన్ను అన్వేషిస్తారు. ఈ విషయంలో అవధూతకు యదుమహారాజుకు జరిగిన సంవాదరూపంలో వున్న ఒక ఇతిహాసాన్ని పెద్దలు చెప్పారు.

ఒకసారి ఒక అవధూత నిర్భయంగా తిరుగుచుండెను. అతడు తెలివైనవాడు. మధ్యవయస్కుడు అతడిని చూచి యదుమహారాజు ఇలా అడిగాడు.

యదువు:- బ్రాహ్మణా! నీవెలాంటిమంచి చేయటంలేదు. అయినా ఇలాంటి లౌకికబుద్ధి నీకెలా కలిగింది? నీవు పండితుడవైనా ఏ తెలివిచేత పిల్లవాని లాగా ఈ జగత్తులో సంచరిస్తున్నావు?

ప్రపంచంలో జీవులు సాధారణంగా ఆయుస్సు, యశస్సు, ఐశ్వర్యం కోరి ధర్మార్థకామాలందు, ఆత్మతత్త్వ జిజ్ఞాసలందు ప్రవృత్తులగుతున్నారు. నీవు సమర్థుడవు, కవివి, దక్షుడవు, సుందరుడవు, మృదుభాషివి అయినా జడోన్మత్తపిశాచిలాగా వుండి ఏరకమైన పనిని చేయడం లేదు. జనులు కామలోభాలనే దావానలంచే ఎల్లప్పుడు కాల్చివేయబడుతున్నారు. అయినా

నీవు నీటిలో ఏనుగులాగా సంతాపరహితుడిలా వున్నావు. నీవు విషయభోగరహితుడవై మనసులో సంతోషాన్నెట్లనుభవిస్తున్నావు? నాకు తెలుసుకోవాలనుంది చెప్పు.

భగవంతుడు:- ఉద్ధవా! యదుమహారాజు బ్రాహ్మణుల మేలుకోరేవాడు, తెలివైనవాడు. ధనవంతుడైన బ్రాహ్మణుని సత్కారంచేసి నమస్కరించి ఇలా అడిగాడు. తర్వాత బ్రాహ్మణుడిలా చెప్పాడు.

బ్రాహ్మణుడు:- రాజా! నా తెలివితో ఎందరో గురువులనాశ్రయించాను. వారివల్ల జ్ఞానంపొంది ఈ లోకంలో స్వేచ్ఛగా తిరుగుతున్నాను. నీవా గురువుల పేర్లు, వాళ్ళ నుండి తెలుసుకున్న జ్ఞానాన్ని విను.

1. పృథివి 2. వాయువు 3. ఆకాశం 4. జలం 5. అగ్ని 6. చంద్రుడు 7. సూర్యుడు 8. పావురము 9. అజగరము 10. సముద్రం 11. పతంగం 12. తేనెటీగ 13. ఏనుగు 14. తేనెను తీసేవాడు 15. హరిణము 16. చేప 17. పింగళ అను వేశ్య 18. కోరపక్షి 19. బాలుడు 20. కన్య 21. బాణాన్ని చేసేవాడు 22. పాము 23. సాలెపురుగు 24. భ్రమరకీటకం ఈ ఇరవై నాలుగింటిని గురువులుగా భావిస్తున్నాను. వీటి ప్రవర్తన ననుసరించి తెలివి సంపాదించి నేనీలోకంలో తిరుగుతున్నాను.

యయాతికుమారా! నేను వీనిలో దేనిదేని వలన ఏ ఏ జ్ఞానాన్ని పొందానో చెప్తావిను.

ధీరుడైన మానవుడు భూతములచే బాధింపబడ్డా దానిని దైవేచ్ఛగా తలచి ధర్మమార్గం నుండి తొలగకూడదు. జంతువుచే తొక్కబడ్డా చలింపని భూమినుండి నేనీ క్షమాగుణం నేర్చాను. సదా పరోపకారం చేయాలనుకునేవాడు, ఎల్లప్పుడు ఇతరులకోసం జీవించువాడగు సాధువు

పర్వతంనుండి పరోపకార వృత్తిని, వృక్షం నుండి పరాధీన వృత్తిని నేర్చుకోవాలని తెలుసుకున్నాను. జ్ఞానం నశించకుండా వాక్కు, మనస్సు, నిక్షిప్తాలు కాకుండా ముని ఇంద్రియవృత్తులతో కాక ప్రాణవృత్తులతో సంతోషించాలి.

యోగులు నిశ్చింతులై విషయాలనుభవిస్తున్నా గాలిలా అంటన ట్లుండాలి. యోగి దేహంలో ప్రవేశించిన బాల్య యౌవనాలను ఒప్పుకున్నా గాలి వాసనతో కలవనట్లు వాటి యందాసక్తుడు కాడు. శరీరంతో వుండే ముని తనను బ్రహ్మమని తలచి స్థావరజంగమాలలో తనను అపరిచ్ఛిన్నమని, అసంగమని భావించాలి.

గాలిచేత ప్రేరేపింపబడిన మబ్బులసమూహంచే ఆకాశం కలవనట్లు పురుషుడు కూడ కాలనిర్ణయాలగు తేజస్సు, జలం, అన్నమయమగు దేహాదిపదార్థాలతో స్పృశింపబడడు.

స్వచ్ఛమైన వాడు, స్నేహశీలి, మధురభాషి అయిన ముని జనులకు తీర్థస్వరూపుడై దర్శన, స్పర్శన కీర్తనల ద్వారా వారిని జలంలాగా పవిత్రులను చేస్తాడు.

తేజస్వి, తపస్సు చేత దీప్తుడు, దుర్ధర్షుడు, పరిగ్రహం లేనివాడు ముక్తాత్ముడు అయిన ముని ఏది భోంచేసినా అగ్నిలాగా ఎటువంటి మాలిన్యం పొందదు. సాధకుడు నిప్పులాగా కొన్ని చోట్ల రహస్యంగా కొన్ని చోట్ల స్పష్టంగా వుండాలి. కోరికలు కలిగిన మానవులుపాసించడానికి తగిన రూపంతో అతడు కొన్ని చోట్ల తెలియబడుతాడు. దాతలపాపరాశిని దహింపచేస్తూ అన్నాది ద్రవ్యాలను స్వీకరించాలి. పరమాత్మ తన మాయచే సృష్టించిన దేవతిర్యగాది శరీరాలలో ప్రవేశించి కట్టెలలో వున్న అగ్నిలాగా

ఆయా స్వరూపాలలో గోచరిస్తూ వుంటాడు.

కాలప్రభావం వల్ల చంద్రుని కళలు వృద్ధి క్షయాలు పొందునట్లు పుట్టుకనుండి మరణమువరకు అన్నీ దేహానికి సంబంధించినవి. ఆత్మ ఎటువంటి వికారాలను పొందదు. దీనినే నేను చంద్రుని నుండి నేర్చుకొన్నాను. అగ్ని కీలలు ఎపుడు పుట్టి నాశనం పొందుతున్నా కనపడనట్లే నదీప్రవాహంలా కాలప్రభావంచే జీవులదేహాలు కూడ ఎపుడు ఉత్పత్తి వినాశాలు పొందుతున్నా అజ్ఞానం వలన కనపడవు.

భాస్కరుడు కిరణాలతో నీటిని ఆకర్షిస్తాడు. సమయం వచ్చినపుడు కురిపిస్తాడు. అలాగే యోగి ఇంద్రియాలతో విషయాలు గ్రహిస్తాడు. అవసరమైతే అంటే యాచకులు వచ్చినపుడు దానం చేస్తాడు. కాని వాటియందాసక్తుడు కాడు. తనలో వున్న ఆత్మ సూర్యునిలాగా భిన్నంగా కనపడదు. వేరు వేరు శరీరాలలో ప్రవేశించిన ఆత్మ భిన్నభిన్నమైన ఉపాధులలో ప్రతిబింబించిన సూర్యునిలాగా స్థూలబద్ధులగు వారికి కనపడుతుంది.

ఎక్కడా, ఎవ్వరితోనూ అతిస్నేహం, అతిప్రసంగం చేయకూడదు. అలాచేసేవాడు తెలివి తక్కువైన పావురంలా బాధా తప్తుడవుతాడు.

ఒక అడవిలో ఒక పావురం ఒక చెట్టుపైన గూడు కట్టుకొని తన భార్యతో కలిసి చాలా సంవత్సరాలు కాపురముండేది. గృహస్థధర్మంలో అభిరుచి కలిగిన ఆ పావురాలు స్నేహహృదయంతో సదా దృష్టితో దృష్టిని, అంగముతో అంగాన్ని, బుద్ధితో బుద్ధిని బంధించుకొన్నాయి. ఆ పావురాలు రెండూ వనాలలో పడుకొనుట, కూర్చొనుట, తిరుగుట, నివసించుట, మాట్లాడుట, ఆడుకొనుట, భోజనం చేయుట మొదలైన పనులు స్వచ్ఛందంగా

చేసుకుంటుండేవి. ఆడపావురం ప్రేమతో, మందహాసంతో మగపావురా న్ననుకరిస్తూ ఆ పావురపు అనుగ్రహానికి గురైంది. తానేమడిగినా ఇంద్రియనిగ్రహం లేని మగపావురం కష్టపడి సంపాదించి తెచ్చిపెట్టేది. కొంతకాలానికి ఆడ పావురం గర్భం ధరించి గుడ్లను తన భర్త ముందర పెట్టింది. శ్రీహరి అనుగ్రహంవల్ల గుడ్లు పగిలాయి. వాటినుండి కాళ్ళు కలిగిన పిల్లలు బయటపడ్డాయి. వాటి శరీరావయవాలు చాలా సుందరంగా వుండినవి. పుత్రవాత్సల్యం గల ఆ దంపతులు బిడ్డల పలుకులను, మధుర శబ్దాలను వింటూ సంతోషంతో పెరుగుతూ వచ్చాయి.

సదా ఆనందంతో వుండే ఆ సంతానం వాటి సున్నితమైన రెక్కలచేత తల్లిదండ్రులకు సుఖస్పర్శను, అమాయకపు చేష్టలతో ఎగురుటవల్ల సంతోషాన్ని కలిగించాయి. భగవంతుని మాయవల్ల ఆ పావురాలు అన్యోన్యం బద్ధ హృదయులై బిడ్డలను పోషించేవి.

ఒకనాడు ఆ పావురాలు బిడ్డలకు ఆహారం తేవాలని అడవికి పోయాయి. చాలా సమయం దాకా అడవిలో నాలుగు వైపులా ఆహారంకోసం తిరిగాయి. ఇంతలో ఒక వ్యాధుడు ఆ పావురపు పిల్లలను చూచి వలవేసి వాటిని బంధించాడు. బిడ్డలను పోషించుటలో సదా ఉత్సుకత కలిగిన ఆ పావురాలు ఆహారాన్ని తీసుకొని గూటికి చేరాయి. వలలో తగుల్కొని తనను చూచిన వెంటనే ఏడుస్తున్న తన బిడ్డలను చూచి ఆడ పావురం గట్టిగా ఏడ్చుకుంటూ వాటిదగ్గరకు పరుగిడింది. భగవంతుని మాయవల్ల ఆడపావురం దీనురాలయ్యింది. వలలో తగుల్కొన్న తన పిల్లలను చూచి స్పృహ కోల్పోయి ఆ పావురం తాను గూడా వలలో తగుల్కొన్నది. తన ప్రాణసమానమైన పిల్లలు, భార్య వలలో చిగుల్కొని వుండటం చూచి మగపావురము మిక్కిలి దుఃఖంతో విలపించింది.

మానవులారా! నేను ఇహలోక సుఖాలలో తృప్తిలేని వాణ్ణి, పరలోక సుఖం సంపాదించని వాణ్ణి, అల్పపుణ్యవంతుణ్ణి, దుర్మతిని అలాంటి నన్ను చూడండి. త్రివర్గసాధనకారణమైన నా గృహస్థాశ్రమం నష్టమయ్యింది.

అయ్యో! నాకు తగినది అనుకూలవతి అయిన నా భార్య నన్ను ఈ శూన్య గృహంలో విడచి సాధువులైన పుత్రులతో కలిసి స్వర్గానికి వెళుతున్నది. నేను దీనుణ్ణి నా భార్య బిడ్డలు చనిపోయారు. దుఃఖజీవితాన్ని గడిపే నేనెందుకీ శూన్య గృహంలో జీవించాలి?

పావురం పిల్లలు వలలో చిగులుకొని చనిపోతున్నట్లు కనపడు తుండెను. ఆ దృశ్యాన్ని చూచి మూర్ఖురాలైన పావురం తెలివితక్కువదై తాను గూడ వలలో పడెను. క్రూరుడైన బోయడు గృహస్థులైన ఆ కపోత దంపతులను, శిశువులను పట్టుకొని కోరిక తీరినవాడై సంతోషిస్తూ ఇంటికిపోయాడు.

పై చెప్పిన పావురం లాగా కుటుంబీకుడైన పురుషుడు కుటుంబపోషణలో చిక్కుకొని కష్టాల పాలవుతున్నాడు.

ముక్తిద్వారంలా వున్న మానవదేహాన్ని పొంది పావురంలా గృహస్థధర్మంలో వున్నవానిని పండితులు "ఆరూఢచ్యుతుడు" అంటారు.



## మూడవ అధ్యాయము

బ్రాహ్మణుడు:- రాజా! స్వర్గనరకాలలో ప్రాణులకు అడగకుండానే లభించేవి సుఖదుఃఖాలు అందువల్ల తెలివైనవాడు ఈ విషయం తెలుసుకొని సుఖం కోసం ప్రయత్నం చేయనవసరంలేదు. కొండచిలువ లాగా ఉదాసీనుడై సులభంగా లభించిన పదార్థం రుచిగావున్నా, లేకున్నా ఎక్కువగావున్నా, తక్కువగావున్నా ఎలా వున్నా తీసుకోవలెను. ఏ సమయంలోనైనా ఆహారం దొరకకపోతే అది దైవేచ్ఛగా భావించి, ధైర్యంతో కొండచిలువ లాగా ఎటువంటి ప్రయత్నం లేకుండా నిరాహారంగా చాలాకాలం వుండాలి.

శరీరంలో బలంవున్నా లేనట్టుగా, నిద్రరాకున్నా నిద్రపోతున్నట్లుగా వుండాలి. కర్మేంద్రియాలున్నా వాటితో ఎటువంటి పని చేయకూడదు. కొండచిలువ (పాము) నుండి నేనిలాంటి జ్ఞానాన్ని సంపాదించాను.

ముని, ప్రసన్న గంభీరుడు, దుర్విగాహ్యుడు, దాటనలవికానివాడు, అనంతుడు, కలత చెందనివాడును అయి నిశ్చల సముద్రం లాగా వుండాలి. వర్షాకాలంలో నదులన్నీ కలిసినా సముద్రం లాగా వుండాలి. వర్షాకాలంలో నదులన్నీ కలిసినా సముద్రం పెరగదు. ఎండాకాలంలో తగ్గదు. అలాగే భక్తుడు ఈ లోకంలో దొరికే పదార్థాలతో సంతోషం పొందకూడదు. అవి దొరక్కపోతే దుఃఖపడకూడదు.

ఇంద్రియనిగ్రహం లేనివాడు దైవమాయలో పడి స్త్రీలందు మోహంగలవాడై నిప్పువైపు పరుగెత్తే మిడత లాగా నరకంలో పడి కష్టాలనుభవిస్తాడు. మూఢుడైన మానవుడు కాంతాకనకాలు, వస్త్రభూషణాలు మొదలైన అశాశ్వతపదార్థా లందాసక్తుడైనాడు. వీటిననుభవించుటలో తన మనస్సును లగ్నం చేసి పతంగంలాగా నశిస్తాడు.

శరీరమున్నంతవరకు సన్యాసి గృహస్థులకు ఎటువంటి కష్టం కలగకుండా మితాహారాన్ని సంపాదించుకోవాలి. మధుకరవృత్తిని అవలంబించకూడదు. చిన్న, పెద్ద పూలన్నిట్లో తుమ్మెద సారం గ్రహించునట్లు, తెలివైనవాడు చిన్నపెద్ద శాస్త్రాలన్నింటి సారాన్ని గ్రహించాలి.

ముని సాయంత్రానికి, రాత్రికి ఆహారాన్ని దాచిపెట్టుకోకూడదు. అరచేతినే భిక్షాపాత్రగా చేసికొని పొట్ట నింపుకొని ఆ పూటకు మాత్రమే ఆహారం సంపాదించుకోవాలి. తేనెటీగలాగా ఎక్కువ సంపాదించు కోకూడదు. ఒకవేళ తేనెటీగలాగా కూడబెట్టుకున్నా ఆ ద్రవ్యం నశిస్తుంది.

సన్యాసి కర్రతో చేసిన స్త్రీ బొమ్మను కాలితో కూడ తాకకూడదు. అలా జరిగితే అతడు ఆడయేనుగు సంబంధం వలన మగ యేనుగులాగా విషయాలకు లోనై బంధానికి గురవుతాడు. ఎక్కువ బలంగల ఏనుగులవల్ల ఇంకొక యేనుగు చంపబడినట్లు స్త్రీలోలుడైనవాడు ఆ స్త్రీలచే తీసుకురాబడిన ఇతరజార పురుషులవల్ల చంపబడును. కాబట్టి తెలివైనవాడు మృత్యుసమానమైన స్త్రీసంపర్కాన్ని కోరకూడదు.

తేనెను చేర్చిన తేనెటీగలు దానిని తినలేవు. తేనె తీసేవాడు తింటాడు. అట్లే పిసినారి చాలా కష్టపడి ధనాన్ని కూడబెడతాడు. దానినెవ్వరికీయడు. స్వయంగా అనుభవించడు. వాడి డబ్బును లోకులనుభవిస్తారు.

తేనెను దొంగిలించే వ్యాధుడు ఇతరులు సంపాదించిన తేనెను దొంగిలించినట్లు యతి గృహస్థులు కష్టపడి సంపాదించిన ద్రవ్యాన్ని, సిద్ధమైన ఆహారాదులను వాళ్ళకంటె ముందు భుజిస్తాడు.

( సదా విషయసంబంధ విషయాలను వినకూడదు. వ్యాధుస సంగతానికి గురై బంధింపబడిన లేడినుండి అతడీ

జ్ఞానాన్ని నేర్చుకోవాలి. జింక నుండి పుట్టిన ఋష్యశృంగుడు విషయాలైన నృత్యవాద్య గీతాలందాసక్తుడై వారి చేతిలో కీలుబొమ్మైనాడు.

గాలానికున్న మాంసంమీద మోహంతో చేప తన ప్రాణాలను పోగొట్టుకుంటుంది. దుష్టుడు జిహ్వా చాపల్యంతో రసవిమోహితుడై మృత్యుముఖంలో పడతాడు. జ్ఞానులు నిరాహారులై నాలుకను కాక మిగిలిన ఇంద్రియాలన్నింటిని జయిస్తారు. కాని ఉపవాసముండేటప్పుడు వారి జిహ్వారుచి ముందుకంటె ఎక్కువగా వుంటుంది. పురుషుడు అన్ని ఇంద్రియాలను జయించినా జిహ్వేంద్రియాన్ని జయించకపోతే జితేంద్రియుడు కాలేడు. ఈ రసనేంద్రియాన్ని వశంచేసుకుంటే అన్ని ఇంద్రియాలు వశమవుతాయి.

రాకుమారా! పురాతన కాలంలో మిథిలానగరంలో పింగళ అను వేశ్య వుండేది. నేనామెనుండి కొంచెం జ్ఞానం సంపాదించాను చెప్తావిను.

ఒకరోజు రాత్రి ఆ వేశ్య సంకేతస్థలానికి ప్రియుణ్ణి తీసుకొనిపోవాలని బాగా అలంకరించుకొని సాయంకాలం వాకిట్లో నిలుచుకొని వుండినది. ధనాకాంక్షి అయిన ఆ కాంత ఆ సమయంలో ఆ మార్గంలో పోయే ప్రతిపురుషుని చూచి వీడు ధనవంతుడు ఎక్కువ డబ్బిచ్చి నన్నునుభవించడానికే ఇలా వస్తున్నాడని అనుకుంటూ వుండేది. వచ్చేవాళ్ళు పోతుంటే ఇంకొకడొచ్చి ఎక్కువ డబ్బిచ్చి తననునుభవిస్తాడని ఆ వేశ్య భావిస్తుండేది. ఈ విధంగా ఆమెలో దురాశ పెరిగింది. ద్వారం దగ్గరే నిలబడి చాలాసేపు ఎదురుచూచింది. నిద్ర కూడా నశించింది. ఇలా ఇంటిలోకి బయటికి తిరుగుతుంటే అర్ధరాత్రి గడిచింది. తర్వాత ధనాశతో శుష్కించి దీనమనస్కురాలైన ఆ వేశ్యకు ధనాశ ఎక్కువయ్యింది. తద్వారా

ఆమెకు వైరాగ్యం పుట్టింది. విరక్తురాలైన ఆ వేశ్య ఒక పాట పాడింది. దానిని మీకు వినిపిస్తాను. వైరాగ్యమే జీవుని ఆశాపాశాలను తొలగించే సాధనం. జ్ఞానహీనుడు మమతను వదలుటకు ఇష్టపడడు. అట్లే వైరాగ్యం కలగని పురుషుడు దేహబంధాలను వదలడానికిష్టపడడు.

పింగళ:- అయ్యో! ఇంద్రియాలకు వశమై మోహంలో పడిపోయాను. తెలివితక్కువదాననై ఉనికేలేని దుష్టపురుషుల విషయసుఖాలను ఆశిస్తున్నాను. నా ఎదురుగా రమణుడు, రతిప్రదుడు, ధనదాత, నిత్యుడు అయిన భగవంతుడున్నా ఆయన్ను వదలి తెలివితక్కువదాననై దుఃఖాన్ని, భయాన్ని, శోకమోహాలను కలిగించే పురుషులను సేవిస్తున్నాను. బ్రతుకు తెరువుకోసం హేయమైన వేశ్యావృత్తి నాశ్రయించాను. శరీరానికి, మనస్సుకి కష్టాన్ని కలిగించాను. డబ్బుతో నా శరీరాన్నికొన్నారు. నేను మూర్ఖురాలను. ఈ శరీరం ఒక ఇల్లు. దీంట్లో ఎముకలతో కట్టబడిన వెదుళ్ళు, స్తంభాలు వున్నాయి. చర్మంతో, వెంట్రుకలతో, గోళ్ళతో మూయబడి వుంది. ఇందులో నవద్వారాలున్నాయి. వీటినుండి ఎప్పుడూ మలం వస్తూ వుంటుంది. దీనిలో సంపద పేరుతో మలమూత్రాలు మాత్రమే ఉన్నాయి. ఈ శరీరాన్ని నాకంటె ఎవరు ప్రేమిస్తారు? ఆత్మజ్ఞానాన్నిచ్చే భగవంతుని వదలి ఇతర జనులనుండి భోగాన్ని కోరాను. ఈ విదేహ నగరంలో నాకంటె మూఢస్త్రీ ఇంకెవ్వరు లేరు. భగవానుడే భక్తులకు ప్రియుడు, స్నేహితుడు, ప్రభువు నేను ఆయనకు ఆత్మనివేదన చేసికొని లక్ష్మీదేవిలాగా ఆయనతో కలిసి విహరిస్తాను. కాలప్రభావంతో చలించేటివి, ఉత్పత్తివినాశ శీలాలైన విషయాలు, కామాంధులైన నరులు నాకెలాంటి సుఖాన్ని కలిగించారు? అలాగే దేవతలు తమ భార్యలకు ఎంతమాత్రం సుఖం పంచిపెట్ట గలిగారు? నేను పుణ్యం చేసుకున్నాను కాబట్టి భగవంతుడు నాకు ప్రత్యక్షమైనాడు. అప్పటినుంచే

వైరాగ్యం కలిగింది. నాకీవైరాగ్యం తప్పక సుఖాన్ని కలిగిస్తుంది. నేను దురదృష్ట వంతురాలినైతే వైరాగ్యాన్ని కలిగించే కష్టాలు నాకు కలిగేటివి కావు. నరుడు వైరాగ్యం వల్లనే గృహాదిబంధాలనుండి విముక్తుడై శాంతిని పొందుతాడు. భగవంతుని ఉపకారాన్ని నేనిపుడు శిరస్సు వంచి స్వీకరిస్తున్నాను. విషయభోగాల్లో దురాశ వదలి ఆ భగవంతుని శరణు పొందుతున్నాను. అనుకోకుండా దొరికిన దానితో జీవితాన్ని గడుపుతూ ఆనందం, శ్రద్ధ కలిగి పరమాత్ముడైన శ్రీహరితో విహరిస్తాను. సంసారమనే బావిలో పడినవాడు, విషయాలపై దృష్టిగలవాడు, కాలమనే పాముచే పట్టుకొనబడిన వాడైన జీవుని ఆ జగదీశ్వరుడు తప్ప ఎవరు కాపాడ గలరు? ఈ ప్రపంచమంతా కాల సర్పంచే పట్టుకోబడిందని తెలిసికొని తెలివైన మానవుడు అన్ని విషయాల నుండి విరక్తుడై వుండాలి. అపుడే తనను తాను రక్షించుకోగలడు.

బ్రాహ్మణుడు:– పింగళ ఇలా నిశ్చయించుకొని ప్రియుని కలవాలనే దుష్టబుద్ధిని వదలి మనశ్శాంతితో పక్కపై శయనించెను. నిజానికి ఆశే పరమదుఃఖము. నిరాశే పరమసుఖము. అందుకే పింగళ అనే వేశ్య పురుషులపై గల ఆశను వదలి సుఖనిద్రపొందింది.



## నాల్గవ అధ్యాయము

బ్రాహ్మణుడు:- ప్రియమైన వస్తువులలో కోరిక కలిగి వుండటమే మానవుల దుఃఖానికి కారణము. ఈ విషయం తెలుసుకొని ఏదీకోరనివారు సంతోషాన్ని పొందుతారు.

బలము కలిగిన కురరపక్షులు మాంసపుముక్క కలిగిన ఇంకొక కురరపక్షిపై దాడిచేశాయి. ఆ నిముషంలోనే ఆ కురరపక్షి ఆ మాంసపుముక్కను వదలి సుఖించింది.

నాకు మానావమానాలు, భార్యాబిడ్డలు అనే ఆలోచనలు లేవు. కాబట్టే నేను బాలునిలాగా ఆత్మక్రీడాశీలుడను, ఆత్మ సంతుష్టుడను అయి సంచరిస్తున్నాను. ఈ ప్రపంచంలో ఇద్దరే చింతలేనివారుగా, అతీతానంద మగ్నులుగా ఉంటారు. వాళ్ళలో ఒకడు అజ్ఞుడు నిశ్చేష్టుడైన బాలుడు. ఇంకొకడు గుణాతీతుడైన పురుషుడు.

ఒకసారి ఒక అమ్మాయిని చూచేందుకు (పెళ్ళిచూపులకు) కొందరు ఆ అమ్మాయి ఇంటికి వచ్చారు. ఆ సమయంలో ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఇంట్లోలేరు. కాబట్టి ఆ అమ్మాయే స్వయంగా వచ్చిన వారికి అతిథిమర్యాదలు చేసింది. వచ్చినవారికి భోజనం పెట్టడానికి ఆమె లోపల ఒంటరిగా ధాన్యాన్ని దంచడం మొదలుపెట్టింది. అప్పుడామె చేతులకుండే శంఖాకారపు గాజులు పెద్దగా శబ్దం చేశాయి. అతిథుల ఎదురుగా ధాన్యాన్ని దంచడం వారి స్థితిని తెలియజేస్తుంది. అందుకని ఆమె ఒక్కొక్క గాజును పగులగొట్టేసింది. ఒక్కొక్క చేతికి రెండేసి గాజులు మాత్రం పెట్టుకున్నది. మళ్ళీ ఆమె ధాన్యాన్ని దంచడం మొదలుపెట్టగా ఆరెండేసి గాజులు శబ్దం మొదలుపెట్టాయి. అప్పుడామె ఒక్కొక్క గాజు తీసేసింది. రెండు చేతులకు ఒక్కొక్కటె వుంటె

ఎటువంటి ధ్వని రాలేదు. నేను మానవుల ఆచారాలను గమనిస్తూ ఆమె ఇంటికిపోయి అమెనుండి ఇది తెలుసుకున్నాను. ఎక్కువమంది ఒకచోట వుంటె విరోధము, ఇద్దరే వుంటె వార్తా చర్చ జరుగుతుంది. కాబట్టి కుమారి చేతికున్న గాజులాగా ఒంటరిగా వుండాలి. శ్వాసని, ఆసనాన్ని జయించి వైరాగ్యాభ్యాసయోగాల ద్వారా మనసును లగ్నంచేసి ఒక లక్ష్యం వైపుంచాలి. దేవునిపైన మనస్సు నిలిపిన వాడు నెమ్మదిగా కర్మవాసనలను కడిగేస్తాడు. సత్త్వగుణాభివృద్ధి ద్వారా రజోగుణ తమోగుణవృత్తులను త్యజించినవాడు నూనెలేని నిప్పులాగా శాంతిని పొందుతాడు.

బాణాలను చేసేవాడు అందులో నిమగ్నుడై సైన్యంతో రాజు ప్రక్కనే పోతున్నా గమనించడు. అలాగే యోగి భగవంతుని యందు చిత్తం నిలిపినపుడు లోపలి, వెలుపలి విషయాలలో దేనిని గుర్తించడు.

సాధువు పాములాగా ఒంటరిగా తిరగాలి. ఒకే స్థానంలో వుండ కూడదు. ప్రమాదంలో పడకూడదు. బాహ్యాచారాలను గుర్తించకూడదు. మితభాషిగా వుండాలి. అశాశ్వతమైన ఈ శరీరానికి ఇల్లుకట్టుకొనుట దుః ఖదాయకము. వ్యర్థము. ఇతరులచే కట్టబడిన ఇంటిలో వుండి పాము సుఖిస్తున్నది కదా!

నారాయణుడొక్కడే తనమాయచే సృష్టికాలంలో ఈ ప్రపంచాన్ని సృష్టించి, ప్రళయకాలంలో తన అంశతో దానిని సంహరించి తనలో వుంచుకొంటాడు. ఆయనే ఆత్మాధారుడు, అఖిలాశ్రయుడు, అద్వితీయుడు. స్వానుభవస్వరూపమగు కాలముచే సత్త్వం మొదలైన శక్తులు సమానావస్థను పొందగా ప్రకృతి పురుషులకధీశ్వరుడు, బ్రహ్మాది దేవతలకు జీవులకు ఆశ్రయయోగ్యుడు, నిరుపాధికుడు, పరమానందరూపుడు, కైవల్య సంజ్ఞకుడు అయిన సనాతన పురుషుడొక్కడే ప్రకాశిస్తాడు. ఆయన సృష్టికాలంలో మొదటిసారిగా

ఆత్మానుభావ స్వరూపమైన కాలముచే మూడు గుణాలతో కూడిన మాయను క్షోభపెట్టి తద్వారా క్రియాశక్తి ప్రాధాన్యయుక్తమైన మహత్తత్వాన్ని సృష్టించాడు. దేనియందీ విశ్వం గుచ్చబడివున్నదో దేనిచేత జీవుడు సంసారదశను పొందుతున్నాడో ఆ మహత్తత్త్వాన్ని త్రిగుణకార్యమని శాస్త్రకారులు చెప్తున్నారు. అది త్రిగుణాత్మికమగు నానావిధప్రపంచాన్ని ప్రకటిస్తుంది.

సాలెపురుగు గుండెలనుండి ముఖంద్వారా దారాన్ని వ్యాపింపచేసి ఆ దారంలోనే విహరిస్తుంది. మళ్ళీ దాన్నే మింగేస్తుంది. అలాగే మహేశ్వరుడు తననుండి ఈ విశ్వాన్ని సృష్టిస్తాడు. చివరకు దానిని తనలో లీనం చేసికొంటాడు.

జీవి స్నేహంచేతగాని, ద్వేషంచేతగాని, భయంచేతగాని ఏకాగ్రంగా తన మనస్సును దేనియందు లగ్నం చేస్తే ఆయా వస్తు స్వరూపాన్ని పొందుతాడు. భ్రమరం ఒక కీటకాన్ని తెచ్చి తానున్నప్రదేశంలో వుంచుతుంది. ఆ కీటకం భయంతో దానినే చింతిస్తూ తన మొదటి రూపాన్ని వదలక ఆ శరీరంతోనే తద్రూపాన్ని పొందుతుంది.

ఈ గురువులందరి ద్వారా నేను ఈ విధమైన జ్ఞానాన్ని సంపాదించాను. ఇపుడు నేనీ శరీరం నుండి నేర్చుకున్న విషయాన్ని చెప్తా విను.

వైరాగ్యము, వివేకము కలిగించే ఈ శరీరాన్ని గురువుగా భావించాను. దీనిని కుక్కలు నక్కలు ఆహారంగా ఉపయోగించుకుంటాయి. కాబట్టి నేను దీనిపై ఆసక్తి వదిలేశాను. తత్త్వాను సంధానానికి అవసరమైనంతవరకే దీనితో సంబంధము పెట్టుకుంటున్నాను. ఈ తనువు తత్త్వవిచారానికి సహాయపడుతుంది. మానవుడీ శరీరాన్ని సంతోషపెట్టడానికి ఆత్మీయులను, ధనాన్ని, పశువులను, సేవకులను, గృహాలను, ఆప్తులను, భార్యాబిడ్డలను

వృద్ధి చేసుకొంటాడు. ఆయుష్షు పూర్తవగానే ఈ శరీరం నశిస్తుంది. చెట్టులాగా ఇంకొక శరీరానికి విత్తనమేసి అది గూడ కష్టాలనుభవించేందుకే ఏర్పాటుచేస్తున్నాడు.

ఏ గృహస్థుడికైనా ఎక్కువమంది భార్యలుంటె ఒక్కొక్కరు వాళ్ళవైపుకు ఆ భర్తను ఆకర్షింప చేసుకుంటారు. అలాగే నాలుక, దాహం, జననేంద్రియం, తోలు, పొట్ట, చెవి, ముక్కు, చంచలదృష్టి అనే అన్ని ఇంద్రియాలు దేహాభిమాని అయిన పురుషుని వాటి వాటి విషయాలవైపుకి ఆకర్షిస్తాయి. భగవంతుడు తన మాయచే చెట్లు, పాములు, పశువులు, పక్షులు, క్రూరజంతువులు మొదలైనవి సృష్టించాడు. అయినా ఆయనకు సంతోషం కలుగలేదు. అపుడాయన బ్రహ్మసాక్షాత్కారం కలగ చేసుకొని మనుష్యులను సృష్టించి తద్వారా సంతోషం పొందాడు. అనేక జన్మల తరువాత సుదుర్లభమైన మానవజన్మనుపొంది, ప్రతి రోజూ వెంటబడే చావు దాపురింపకముందే ముక్తికోసం ప్రయత్నించాలి. విషయసుఖాలు పశువులకు కూడా ఉంటాయి. నేనీవిధంగా చాలా మంది గురువుల దగ్గర అనేక రకాల జ్ఞానాన్ని పొంది విజ్ఞానిని, విరక్తుడను, సంగరహితుడను, అహంకారహీనుడను అయి పరమాత్మయందు మనసు నిలిపి ఇక్కడ తిరుగుతున్నాను. బ్రహ్మవస్తువు అద్వితీయం. ఋషులు దానిని అనేకరకాలుగా వర్ణించారు. కాబట్టి ఒకే గురువునుండి నేర్చుకున్న జ్ఞానం స్థిరం కాదు.

భగవంతుడు:– ఉద్ధవా! గంభీరబుద్ధి గల దత్తాత్రేయుడు యదురాజుకీ విధంగా ఉపదేశించాడు. యదువు ఆ గురువును చాలా రకాలుగా పూజించాడు. దత్తాత్రేయుడు మహదానందంతో స్వేచ్ఛగా వెళ్ళాడు.

మా పూర్వులకు పూర్వుడైన యదుమహారాజు దత్తాత్రేయుని మాటలు విని అన్ని బంధాలనుండి విముక్తుడై సమదర్శి ఐనాడు.

## ఐదవ అధ్యాయము

భగవంతుడు:- ఉద్ధవా! సాధకుడు అన్ని రకాల నన్ను శరణుకోరాలి. నేను ఉపదేశించిన ధర్మాలు పాటించాలి. నిష్కామభావంతో వర్ణాశ్రమ కులాచారాలను పాటించాలి. విషయపరాయణులైన పురుషులు విషయాలనన్నింటిని నిజాలని నమ్మి వాటిని పొందాలని చేసే ప్రయత్నాలు విరుద్ధఫలాలను ఇస్తాయని గ్రహించి శుద్ధమనస్కుడైన వాడు నిష్కామంగా వుంటాడు. విషయచింతాలోలుడు నిద్రబోయేవాడు అయిన మనిషికి కలలో నానారకాల భోగ్యవస్తువులు కనబడతాయి. అవి నానారూపాలుగా వుండి పరమార్థ ఫలరహితాలవుతాయి. అలాగే ఇంద్రియాలద్వారా కలిగే భేదబుద్ధి కూడా వ్యర్థమే. నన్ను శరణు కోరినవాడు కామ్యకర్మలు వదలాలి. నిత్యనైమిత్తిక కర్మలను కూడా త్యజించాలి. మానవుడు ఎల్లప్పుడు నాయందు మనస్సు నిలిపి యమనియమాలు పాటించాలి. జిజ్ఞాసువు శాంతుడైన గురువును నా స్వరూపునిగానే భావించి సేవించాలి. గురువును సేవించే శిష్యుడు అభిమానం లేనివాడుగా, అహంకారం లేనివాడుగా, సత్యమునే పలుకువాడుగా, విషయమమతలు లేనివాడుగా, గురువుపై గాఢమైన ప్రేమకలవాడుగా, అవ్యగ్రుడుగా, తత్త్వజ్ఞాన కాంక్షిగా, అసూయలేనివాడుగా, వ్యర్థభాషణ లేనివాడుగా వుండాలి. అన్నింటిని సమంగా చూస్తూ భార్య, బిడ్డలు, గృహము, క్షేత్రము, బంధువులు, ధనము మొదలైన విషయాలలో ఉదాసీనుడుగా వుండాలి. కాల్చే అగ్ని కాల్చబడే పదార్థానికంటె వేరై ప్రకాశించునట్లు ద్రష్టయు స్వప్రకాశశీలమైన ఆత్మవస్తువుస్థూల సూక్ష్మదేహాల రెండింటికంటె విలక్షణము, భిన్నము అని తెలుసుకోవాలి. కట్టెలోపల వున్న నిప్పు, కట్టెతో చేయబడిన ఆవరణము, వెలుగు, అణుత్వమహత్త్వాది వివిధ భావాలను గ్రహించునట్లు దేహంలో ప్రవేశించిన జీవాత్మ కూడా

నానాదేహధర్మాలు స్వీకరిస్తుంది.

ఈశ్వరాధీనమైన మాయవలన సూక్ష్మదేహం, స్థూలదేహం సృష్టింపబడ్డాయి. వాటి భ్రమవలన జీవుడికి సంసార స్థితి ఏర్పడింది. కాబట్టి ఆత్మజ్ఞానమే ఈ సంసార స్థితిని పోగొడుతుంది. కాబట్టి జిజ్ఞాసతో శుద్ధపరమాత్మను గురించి తెలుసుకొని క్రమంగా స్థూల సూక్ష్మ దేహవిషయజ్ఞానాన్ని వదలాలి.

గురువు పైనున్న అరణి, శిష్యుడు కిందున్న అరణి. ఉపదేశవాక్యము మధ్యలోనున్న చిలికే కర్ర. వాటి కలయికలో కలిగే జ్ఞానమే నిప్పుతో సమానమై అజ్ఞానాన్ని కాల్చేసి సుఖాన్ని కలిగిస్తుంది. మంచి గురువుచేత ఉపదేశింపబడిన అతివిశుద్ధ జ్ఞానం గుణజాతమైన మాయను నివారించి ఈ ప్రపంచానికి కారణస్వరూపమైన గుణసమూహాన్ని కాల్చేసి ఇంధనం లేని అగ్నిలాగా విషయాలు లేకపోవడం వల్ల స్వయంగా నివృత్తమవుతుంది. నీవెప్పుడయినా కర్మలు చేసే జీవుల నానాత్వాన్ని, కర్మఫలభోక్తల నానాత్వాన్ని, జగత్తుని, కాలాన్ని, శాస్త్రాలను, ఆత్మలను నిత్యాలని, తలంచితే, స్రక్చందన వనితాది సర్వపదార్థాలను యథార్థాలని భావించితే ఘటపటాద్యాకృతి భేదంవల్ల విషయజ్ఞానం పుడుతుందని మారుతుంటుందని భావించితే జీవుల దేహ సంవత్సరాది కాలావయవ సంబంధం వల్ల కలిగే జనన మరణ దశలను కూడ తప్పకుండా నిజమని అంగీకరించాలి. ఇక్కడ కూడా కర్మలుచేసే పురుషుడు సుఖదుఃఖాలనుభవించడం వల్ల స్వతంత్రుడు కానట్లు కనపడుతున్నాడు. స్వతంత్రుడైతే దుఃఖ ఫలానుభవం ఎందుకు కోరుకుంటాడు? కాబట్టి పరాధీనుడైన వానికి పురుషార్థం కలగదు.

విద్వాంసులకు సదా సుఖముండదు. మూఢులకు ఎప్పుడు దుఃఖం కలగదు. కాబట్టి అహంకరించుట తగదు. వారు సుఖప్రాప్తికి, దుః

ఖనాశనానికి ఉపాయాలు తెలిసికొన్నారని భావించినా మృత్యువు వారిపై ఎటువంటి ప్రభావాన్ని చూపకుండా వుండేందుకు తగిన ఉపాయాల నెరుగరని భావించాలి.

చావుకు దగ్గరైనవారికి భోగపదార్థాలు సుఖాన్నీయవు. వధ్యస్థానానికి తీసుకొనిపోతున్న మానవునికి భోగ్యపదార్థాలు సంతోషం కలిగించవు కదా! స్వర్గాది సుఖాలు కూడ స్పర్ధ, అసూయ, నాశం, క్షయాలనే దోషసమూహంచే దూషితాలు. కాబట్టి అవి ఇహలోకసుఖాల్లాగా దుఃఖం కలిగిస్తాయి. వీటిని సాధించే యజ్ఞాదికర్మలు కృషికర్మలవలె ఎక్కువ విఘ్నం కలిగిస్తాయి. కావున ఫలశూన్యాలు. యజ్ఞయాగాది ధర్మాలు ఎటువంటి ఆటంకాలు లేకుండా నెరవేరితే వాటి ద్వారా లభించే స్వర్గాదిలోకాలు ఎలా నశిస్తాయో చెప్తావిను.

యజ్ఞాలు చేసే పురుషుడు ఈ లోకంలో యజ్ఞాల ద్వారా దేవతలనారాధించి స్వర్గాన్ని పొందుతాడు. అక్కడ అతడు పుణ్యకర్మలచే సంపాదించిన భోగాలను దేవతల్లాగా అనుభవిస్తాడు. హృద్యమైన వేషాన్ని ధరించి తాను సంపాదించిన పుణ్యంతో సర్వభోగసంపన్నుడై, విమానమునెక్కి దేవతాస్త్రీల మధ్యవిహరిస్తూ గంధర్వులచే కీర్తింపబడతాడు. చిన్నగంటల మాలతో ప్రకాశిస్తూ స్వైరవిహారంచేసే విమానంలో దేవతాస్త్రీలతో కలిసి కూర్చొని విహారస్థలాలలో క్రీడిస్తాడు. అందువల్ల భోగాంతంలో తప్పక పతనం కలుగుతుందని ఆలోచించడు. పుణ్యమున్నంత వరకే స్వర్గంలో సుఖాలనుభవిస్తాడు. పుణ్యం అయిపోగానే కాలప్రేరితుడై కిందపడతాడు.

నరుడు చెడుస్నేహంవల్ల అధర్మపరాయణుడవుతాడు. ఇంద్రియాలకు లొంగి స్వేచ్ఛగా ప్రవర్తిస్తాడు. లోభబుద్ధిచే దానధర్మాలు చేయక పిసినారవుతాడు. ప్రాణిహింస చేస్తాడు. శాస్త్ర విరుద్ధంగా పశువులను

బలి ఇస్తాడు. ప్రేత, భూత గణాలను ఉపాసిస్తాడు. అప్పుడు పశువులకంటె హీనమై నరకంలో పడతాడు. అజ్ఞానంతో అంధకారంలో పడిపోతాడు. ఈ శరీరం చేసే పనులన్నీ దుఃఖం కలిగిస్తాయి. అవి మాటిమాటికి చావుపుట్టుకలను కలగజేస్తాయి. ఇలాంటి పరిస్థితిలో మరణశీలుడైన జీవుడికి సుఖమెలా కలుగుతుంది?

లోకాలయొక్క, లోకపాలకులయొక్క ఆయుర్దాయము ఒక కల్పము వరకే, కాబట్టి అందరు నన్ను చూచి భయపడుతారు. బ్రహ్మ రెండు పరార్థాల ఆయుష్షు కలవాడు అయన కూడా నన్ను చూచి భయపడతాడు.

ఇంద్రియాలన్నీ పుణ్యపాపాలు చేస్తాయి. సత్త్వాది గుణాలు అన్ని ఇంద్రియాలను వాటి పనులలో ప్రవృత్తమయ్యేట్లు చేస్తాయి. అహంకారపూరితుడు ఇంద్రియాలద్వారా కర్మఫలాన్ననుభవిస్తాడు. అహంకారాది సృష్టిలో సత్త్వాదిగుణాలకు వైషమ్యమున్నంతవరకు జీవుడికి దేవతలు, పశుపక్ష్యాదిరూపాలు కలుగుతాయి. జీవుడికలాంటి నానారూపాలున్నంతకాలం కర్మకధీనుడై వుంటాడు. జీవుడు కర్మపరుడై వున్నంతవరకు కర్మఫలదాతనైన నావల్ల అతడికి సంసారభయముంటుంది. ఈ గుణవైషమ్యాన్ని దానివల్ల కలిగే భోగాలను కర్మలను సేవించే జీవులందరు శోకానికి మోహానికి గురవుతారు. సత్త్వాదిగుణాలు క్షోభచెందినపుడు జనులు నన్ను కాలము, ఆత్మ, ఆగమము, లోకము, స్వభావము, ధర్మము మొదలైన పేర్లతో పిలుస్తారు.

ఉద్ధవుడు:- దేవా! జీవుడు దేహాదిగుణాలలో వున్నప్పటికి గుణాదులవల్ల కలిగే సుఖాలకు ఎందుకు బద్ధుడు కాడు? గుణాలచే ఆవరింపబడినపుడు ఎందుకు బద్ధుడవుతాడు? బద్ధుడు లేక ముక్తుడైన

పురుషుడు ఏ విధంగా వుంటాడు? అతడెలా విహరిస్తాడు? ఏ లక్షణాలతో గుర్తింపబడతాడు? ఏమి తింటాడు? దేన్ని వదలతాడు? ఎలా పడుకుంటాడు? ఎలా కూర్చుంటాడు? ఎలా నడుస్తాడు?

అచ్యుతా! ప్రశ్నను అర్థం చేసుకోవడంలో నీవు చాలా గొప్పవాడివి. నా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పు. ఒకే ఆత్మ ఏ విధంగా నిత్యబద్ధం, నిత్యముక్తం అవుతుంది? నా ఈ భ్రమను తొలగించు.



## ఆరవ అధ్యాయము

భగవంతుడు:- ఉద్ధవా! నా అధీనంలో వున్న సత్త్వాది గుణాలవల్లనే ఆత్మ బద్ధము, ముక్తము అని చెప్పబడింది. నిజానికి ఆత్మకు బంధమోక్షాలు లేవు. గుణాలు మాయాకార్యాలు. అందువల్ల నాకు బంధమోక్షాలులేవు. కల బుద్ధియొక్క వివర్తమైనట్లు శోక మోహాలు, సుఖదుఃఖాలు, జననమరణాలు, దేహానికి సంబంధించిన మాయాగుణాలని తెలుసుకో. నిజంగా వీటికెటువంటి ఉనికి లేదు. విద్య, అవిద్య అనే రెండు పదార్థాలు నేను కల్పించినవే. అవి అనాదులు, నా శక్తి స్వరూపాలు. జీవుల బంధమోక్షాలకు ఇవే కారణాలని తెలుసుకో. నా అంశభూతులు అనాదులయిన జీవులకు అవిద్యవలన బంధము, విద్యవలన మోక్షము కలుగుతాయి. ఒకే శరీరంలో వుండేవారు, వ్యతిరేక ధర్మాలైన సుఖదుః ఖాలతో కూడినవారైన బద్ధముక్తజీవుల భేదాన్ని వర్ణిస్తాను.

జీవుడు, ఈశ్వరుడు అనే పక్షులు రెండు స్వేచ్ఛగా దేహమనే చెట్టుమీదకొచ్చి హృదయమనే గూటిలో నివసిస్తున్నవి. వాటిలో ఒకటి జీవరూప పక్షి అశ్వత్థ చెట్టుయొక్క కర్మఫలాన్ననుభవిస్తుంటుంది. రెండవది ఈశ్వరరూపపక్షి ఫలాన్ననుభవించక జ్ఞానాదులతో సమానంగా ప్రకాశిస్తుంటుంది.

కర్మఫలాన్ననుభవించనివాడు, నిత్యజ్ఞానాశ్రయుడు అయిన ఈశ్వరుడు తన తత్త్వాన్ని, జీవుని తత్త్వాన్ని తెలుసుకుంటాడు. కర్మఫలభోక్త అయిన జీవుడు తన స్వరూపాన్ని గాని, తనకంటె వేరైన స్వరూపాన్నిగాని తెలుసుకోలేడు. అవిద్యాయుతుడైన జీవుడు అనాదిగా బద్ధుడు. ఈశ్వరుడు అనాదిగా ముక్తుడు. అవిద్యవల్ల, విద్యవల్ల వీరికి ఈ స్థితి కలిగింది.

ముక్తపురుషుడు సంస్కారం వల్ల దేహమునందుండికూడ నిద్రనుండి లేచిన పురుషునిలాగా శరీరంలోని సుఖదుఃఖాలనుభవించడు. కాని బద్ధపురుషుడు సహజంగా శరీరంలోని సుఖదుఃఖాలనుభవించనివాడైనా కలగనే పురుషునిలాగా శరీరగతాలయిన సుఖదుఃఖాలనుభవిస్తాడు.

రాగద్వేషాలు లేనివాడు, పండితుడు అయిన వ్యక్తి గుణాలవల్ల కలిగిన ఇంద్రియాలచే విషయాలను గ్రహించినా నేను గ్రహిస్తున్నానని అహంకరించడు. అజ్ఞాని అయిన మానవుడు ముందుచేసిన కర్మలకధీనమైన శరీరంలో వుండి నేను కర్తనని అహంకరిస్తాడు. దానివల్ల బంధింపబడతాడు.

విరక్తుడు, వివేకవంతుడు అయిన పురుషుడు పడుకొనుట, కూర్చొనుట, తిరుగుట, స్నానం చేయుట, చూచుట, తాకుట, వాసన చూచుట, తినుట, వినుట మొదలైన పనులను ఇంద్రియాలచే చేస్తాడు కాని బద్ధుడుకాడు.

సూర్యుడు ఆకాశమంతా నిండివున్నా, నీటిలో ప్రతిబింబిస్తున్నా, గాలిలో వీచుచున్నా ఎక్కడా లగ్నంకానట్లు విద్వాంసుడైన పురుషుడు ప్రకృతిలో వున్నా దానిలో ఆసక్తుడు కాడు. వైరాగ్యమనే అస్త్రంచే, స్వరూపజ్ఞానంచే అన్ని సంశయాలు ఛేదించి కలలోనుండి మేల్కొనిన పురుషుని లాగా దేహాదిప్రపంచంనుండి నివృత్తుడవుతాడు.

ఏ పురుషుడి ప్రాణ ఇంద్రియమనోబుద్ధి విషయప్రవృత్తులు సంకల్పం లేకుండా వుంటాయో అటువంటి వాడు దేహమునందున్నా దాని గుణాలతో బంధింపబడడు. శరీరాన్ని దుష్టులు హింసించినా కోపం కలగనివాడు, ఎవరైనా పూజించినా సంతోషాన్ని పొందనివాడు ముక్తపురుషుడుగా లెక్కింపబడతాడు. లౌకిక వ్యవహారాలలో ఇష్టం లేనివాడు, సమదర్శనుడు

అయిన మహాత్ముడు మంచి పనులనుగాని, చెడ్డపనులనుగాని చేసేవాళ్ళను పొగడడు, తెగడడు. అలాగే మంచిమాటలుగాని చెడుమాటలుగాని మాట్లాడేవారిని గూడ పొగడడు, తెగడడు. అలాంటి వాడే ముక్తపురుషుడు.

ముక్తపురుషుడు దేహంకోసం మంచిచెడులను వేటిని కూడ ఆచరించడు, ఉచ్చరించడు, ఆలోచించడు, అంతట ఉదాసీనభావంతో ఆత్మానంద స్వరూపుడై జడునిలాగా సంచరిస్తాడు. శబ్దబ్రహ్మంలో నిష్ణాతుడయినా భగవత్తత్త్వమును తెలిసికొనలేనివాడైతే పాలనీయని ఆవును పెంచే గొల్లవానిలాగా వాడి శాస్త్రజ్ఞానమంతా వ్యర్థమవుతుంది. అదెలాంటి పురుషార్థాన్నీయదు.

పాలనీయని ఆవు, వ్యభిచారిణి అయిన స్త్రీ పరాధీన శరీరము, దుష్టపుత్రుడు, సత్పాత్రుడు దొరికినా దానం చేయని ధనం, నా గురించి తలవని మాటలు వ్యర్థం. ఈ వస్తువులను కాపాడేవాడు కష్టాలమీద కష్టాలనుభవిస్తాడు. జగత్తు సృష్టిస్థితిలయరూపమైన నాయొక్క పావనలీలా వర్ణనలేనిది, లీలావతారాలలో ఇష్టమయిన నాయొక్క రామకృష్ణాద్యవతారాల పొగడ్తలేనిది అయిన వాక్కు వ్యర్థం అవుతుంది. బుద్ధిమంతుడు ఇలాంటి పలుకులు పలుకుటగాని, వినుటగాని చేయకూడదు. ఇలాంటి విషయంలో దేహధ్యాసను నివారించి సర్వగతుడనైన నాయందు మనస్సు నిలిపి శాంతిని పొందు మనస్సును బ్రహ్మమునందు నిశ్చలంగా ఉంచలేకపోతే నిత్యనైమిత్తిక కర్మలన్నింటిని నిరపేక్షంగా నన్నుద్దేశించి నిర్వర్తించు.

అన్నిలోకాలను పవిత్రంచేసే నా కథలను శ్రద్ధతో వినాలి. మళ్ళీ మళ్ళీ నా అవతారాలను, లీలలను గానంచేయాలి. స్మరించాలి. అభినయించాలి. నన్నాశ్రయించి నాకోసం ధర్మార్థకామాలను ఆచరించాలి. ఈ విధంగా ఆచరించిన వారికి సనాతన పురుషుడనైన నాపై అనన్యమైన

భక్తి కలుగుతుంది. అలాంటి భక్తుడు మంచి స్నేహం ద్వారా నాపై భక్తిగలవాడై నన్ను ధ్యానిస్తాడు. తర్వాత ధ్యానయోగం ద్వారా సులభంగా గొప్పవాళ్ళు చూపించిన నా స్వరూపాన్ని పొందుతాడు.

ఉద్ధవుడు:- ప్రభో! సత్పురుషులు నీ కీర్తిని గానం చేస్తారు. ఎలాంటివారిని నీవు సాధువులంటావు? మంచి వాళ్ళాదరించే ఎటువంటి భక్తిని నీపై చూపాలి? నీవు పురుషాధ్యక్షుడివి, లోకాధ్యక్షుడివి, జగత్ప్రభువువి ప్రణతుడను, అనురక్తుడను, శరణాగతుడను అయిన నాకు పై విషయాలు చెప్పు.

నీవు ప్రకృతికతీతుడవు. గగనంలాగా నిర్లిప్తుడవు. పరబ్రహ్మ స్వరూపుడవు. అయినా భక్తులకోసం నీ ఇష్టాన్ని బట్టి వేరు వేరు రూపాలు ధరించి ఇలలో అవతరిస్తున్నావు.

భగవంతుడు :- ఉద్ధవా! నా భక్తుడు దయాళువు. అతడు ఏ ప్రాణిమీద విరోధం కలిగివుండడు గట్టి కష్టాలనుగూడ ఆనందంతో అనుభవిస్తాడు. వాని జీవితసారం సత్యం. అతని మనస్సులో ఎటువంటి పాపసంబంధం ఉండదు. అతడు సమదర్శి. అందరికీ మేలు చేసేవాడు. అతని బుద్ధి కోరికలతో చెడిపోదు. అతడు సంయమి, మధురస్వభావుడు, శుద్ధుడు, అకించనుడు, లౌకికక్రియలేనివాడు, మితంగా భుజించువాడు, శాంతుడు, స్థిరమైనవాడు, ముని, ఏమరుపాటులేనివాడు, గంభీరస్వభావుడు, ధైర్యవంతుడు, ఆరుగుణాల (ఆకలి, దప్పిక, శోకం, మోహం, జననం, మరణం)ను జయించినవాడు, సన్మానాలు ఆశించనివాడు, ఇతరులను గౌరవించేవాడు, భగవద్విషయాలను చెప్పుటలో నైపుణ్యం గలవాడు, స్నేహశీలి, కారుణ్యం కలవాడు, భగవత్తత్వాన్ని బాగా తెలిసినవాడు. నేను చెప్పిన గుణదోషాలను తెలిసికొని అన్ని ధర్మాలను త్యజించి నన్నే

భజించేవాడు ఉత్తముడు. సర్వాంతర్యామినైన నా స్వరూపాన్ని తెలిసిగాని, తెలియకగాని, నిశ్చలతత్త్వంతో సేవిస్తే వారుత్తమ భక్తులుగా కీర్తింపబడతారు.

నా విగ్రహాన్ని, నా భక్తులను దర్శించాలి, స్పృశించాలి, స్తుతించాలి, నమస్కరించాలి, నా గుణకర్మలను కీర్తించాలి. నా కథలను వినుటలో శ్రద్ధ, నాయందు ధ్యానము వుండాలి. దొరికిన పదార్థం సమర్పించాలి. దాస్యభావంతో ఆత్మనివేదన చేయాలి. నా పుట్టుక గురించి, నా పనులగురించి చర్చించు. నాకు సంబంధించిన పండుగలు సంతోషంగా చేసుకో. గీత, వాద్య, నృత్య గోష్ఠుల ద్వారా నా మందిరాలలో ఉత్సవాలు చేయించు. సంవత్సరానికొక్కసారి పండుగలప్పుడు నా స్థానాలకు యాత్రచేయి. పూజించు, వైదిక, తాంత్రిక పద్ధతులతో దీక్ష స్వీకరించు, వ్రతాలాచరించు. దేవాలయాలలో నా విగ్రహప్రతిష్ఠ చేయించుటలో శ్రద్ధ చూపించు. ఒక్కడివే చేయలేకపోతే ఇతరులతో కలిసిచేయి. నా కోసం పూలచెట్లను, ఉద్యానవనాలను, ఆరుస్థలాలను, నగరాలను, ఆలయాలను నిర్మించు. సేవకునిలాగా శ్రద్ధాభక్తులతో కపటంలేకుండా ఊడ్చుట, అలుకుట, నీళ్ళు చల్లుట, ముగ్గువేయుట మొదలైన పనులద్వారా ఆలయాలలో సేవచేయి. అభిమానం చూపవద్దు. దంభం పనికిరాదు. నీవు చేసే శుభకార్యాలు ప్రకటించుకోవద్దు. నా దగ్గర వెలిగించిన దీపపుకాంతిలో నీ పనులు చేసుకోవద్దు. ఇతర దేవతలకు సమర్పించిన దానిని నాకు సమర్పించవద్దు. లోకంలో నీకు ఇష్టమైనది ప్రియమైనది నాకు సమర్పించు. ఇలా చేస్తే ఆ వస్తువు నీకు అనంతఫలాన్నిస్తుంది. సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణుడు, గోవు, వైష్ణవులు, ఆకాశం, వాయువు, జలం, భూమి, ఆత్మ, సకలప్రాణులు అన్నీ నా పూజాస్థానాలే. ఋగ్యజుస్సామవేద మంత్రాల ద్వారా సూర్యునిలో వున్న నన్ను పూజించు. హోమంతో అగ్నిలోను,

ఆతిథ్యముతో బ్రాహ్మణ శ్రేష్ఠునిలోను, పచ్చగడ్డి మొదలైన వాటితో ఆవులందు నన్ను పూజించు. బంధువులాగా సత్కరించడం వలన వైష్ణవునిలో, ధ్యాన నిష్ఠద్వారా హృదయాకాశంలో, ముఖ్యప్రాణమని తెలిసికొని గాలిలో, జలము, పుష్పము మొదలగు వస్తువులద్వారా నీటిలో నన్నారాధించాలి. మంత్రాల ద్వారా మట్టితో కట్టిన వేదికలో, భోగాలద్వారా జీవునిలో, సమానంగా చూడడం ద్వారా అన్ని ప్రాణులలో అంతర్యామి స్వరూపుడనైన నన్నారాధించు.

ఈ ప్రదేశాలన్నింటిలో శంఖచక్రగదాపద్మాలతో కూడినది, చతుర్భుజము, శాంతము అయిన నా రూపాన్ని ఏకాగ్రతతో ధ్యానించి పూజించాలి.

ఇలా ఏకాగ్రచిత్తంతో యజ్ఞయాగాదులయిన ఇష్టకర్మలద్వారా, చెరువులు బావులు త్రవ్వించుట మొదలైన పూర్తకర్మలద్వారా నన్ను పూజించేవాడికి శ్రేష్ఠభక్తి లభిస్తుంది. సాధువుల సేవవలన నా విషయజ్ఞానం కలుగుతుంది.

నేను సత్పురుషులకు పరమాశ్రయుడను. కాబట్టి సత్సంగం వలన కలిగిన భక్తియోగం తప్ప ఇంకే ఉపాయము మానవుని సంసారం నుండి తరింపచేయలేదు.

నీవునాకు సేవకుడవు, సుహృత్తువు, సఖుడవు కాబట్టి దాచవలసినదైనా నీకొక రహస్యం చెప్తా విను.



## ఏడవ అధ్యాయము

భగవంతుడు:- ఉద్ధవా! సాధుసాంగత్యము లోకంలోని అన్నిరకాల ఆసక్తులను నాశనం చేస్తుంది. సాధుసాంగత్యం నన్ను వశం చేసుకొన్నట్లుగా యోగం, సాంఖ్యం, ధర్మం, స్వాధ్యాయం, తపస్సు, సన్న్యాసం, యాగాది ఇష్టకర్మలు, బావులు త్రవ్వడంలాంటి పూర్త కర్మలు, దక్షిణలు, వ్రతాలు, దేవపూజ, రహస్యమంత్రాలు, తీర్థాలు, యమనియమాలు ఇవేవీ నన్ను వశం చేసుకోలేవు.

అన్నియుగాలలో సత్సంగప్రభావం వల్ల రజస్తమో గుణయుక్తులైన దైత్యులు, రాక్షసులు, మృగాలు, ఖగాలు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, సిద్ధులు, చారణులు, గుహ్యకులు, విద్యాధరులు, మనుష్యుల్లో వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, అంత్యజులు, వృత్రాసురుడు, ప్రహ్లాదుడు, వృషపర్వుడు, బలి, బాణుడు, యముడు, విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, గజేంద్రుడు, జటాయువు, తులాధారుడు, ధర్మవ్యాధుడు, కుబ్జ, వ్రజగోపికలు, యజ్ఞం చేసేవాళ్ళ విప్రులభార్యలు వీళ్ళందరూ నా స్థానాన్ని పొందారు. వాళ్లు వేదాధ్యయనాన్ని, గొప్పవాళ్ళసేవని, వ్రతాన్ని, తపస్సుని ఆచరించకనే కేవలం సత్సంగంచేతనే నన్ను పొందగలిగారు. గోపికలు, గోవు, వృక్షాలు, మృగాలు, మూఢబుద్ధులైన నాగులు సిద్ధులు మొదలైనవారు కేవలం అనన్యభావంచేతనే నన్ను పొందగలిగారు. కాని ఇతరులు యోగం, సాంఖ్యం, దానం, వ్రతం, తపస్సు, యజ్ఞం, నా కీర్తన, వేదాధ్యయనం, ధర్మం మొదలైన వాటిద్వారా చాలా ప్రయత్నంచేసినా నన్ను పొందలేరు.

అక్రూరుడు బలరామునితో గూడ నన్ను మథురకు తీసికొని

వచ్చినపుడు గోపికల హృదయము గాఢంగా నాయందనురక్తమైంది. ఆ సమయంలో కలిగిన తీవ్రవిరహంతో వారు పీడితులైనారు. నేను తప్ప ఇంకే ఇతర వస్తువు వారికాసమయంలో సుఖాన్ని కలిగించలేదు.

నేను బృందావనంలో వున్నపుడు గోపికలు ఎన్నోరాత్రులను అరక్షణంలాగా గడిపారు. నాతో ఎడబాటు కలిగిన తరువాత వాళ్ళకు ఒక్కొక్క రాత్రి ఒక్కొక్క కల్పంలాగా కనపడింది. సముద్రంలో కలిసిన నదుల్లాగా మునులు సమాధియోగంచేత నామ రూపాలను తెలిసికోలేరు. అలాగే గోపికలు కూడా నాయందాసక్తులై మొత్తం మరచిపోయారు.

వేలమంది గోపికలకు నా నిజస్వరూపం తెలియదు. వారు నన్ను భగవంతునిగా కాక కేవలం ఇష్టమైనవాడుగా అనుకుంటున్నారు. కాబట్టి జారభావంతో నన్ను కలుసుకోవాలని ఉత్సాహపడుతున్నారు. సాధనలేని స్త్రీలు కేవలం సాంగత్యం ద్వారానే పరబ్రహ్మస్వరూపుడనైన నన్ను పొందారు. నీవు శ్రుతి స్మృతులను, విధినిషేధాలను, శ్రవణాశ్రవణాలను త్యజించి అన్ని ప్రాణులలో అంతర్యామిగా వున్న నన్ను శరణు పొందు. అందువలన నీవన్నిచోట్ల నిర్భయంగా సంచరిస్తావు.

ఉద్ధవుడు:- యోగేశ్వరేశ్వరా! నీ ఉపదేశాలు విన్నా నాసందేహాలు తీరటంలేదు. నామనస్సు భ్రమకు గురి అవుతున్నది.

భగవంతుడు:- ఉద్ధవా! షట్చక్రాలలో వుండే ఆ పరమాత్మ నాదసహితప్రాణంతో ఆధారచక్రంలో ప్రవేశిస్తాడు. స్థూలభావంతో అనేక వేదాలుగా వెల్లడవుతాడు. అగ్ని ఆకాశంలో ఆవిరి రూపంలో వుంటుంది. గట్టిగా కట్టెలను మధించినపుడు గాలివలన సూక్ష్మమైన విస్ఫులింగాలరూపం ధరిస్తుంది. ఆహుతులనిచ్చినపుడు ప్రచండరూపాన్ని ధరిస్తుంది. అలాగే వేదవాణి సూక్ష్మస్థూల క్రమంతో నన్నే ప్రకటిస్తున్నదని తెలుసుకో. ఇలాగే

వాక్కు, కర్మ, గతి, మలమూత్రవిసర్జన, ఘ్రాణం, రసగ్రహణం, దర్శనం, స్పర్శనం, శ్రవణం, సంకల్పం, విజ్ఞానం, అభిమానం, ప్రకృతి, ప్రవృత్తి, సత్వరజస్తమో వికారం వలన కలిగిన వివిధప్రపంచం నా స్వరూపమే అని తెలుసుకో.

విత్తనాలు భూమిలోపడి నానారకాలుగా బయటకు వస్తాయి. అట్లే త్రిగుణాశ్రయుడు, సనాతనుడు, లోకకారకుడు, అయిన పరమాత్మ మొదట అవ్యక్తుడుగా, ఏక స్వరూపుడుగా వుండి సమయంరాగానే వాగింద్రియ శక్తివికారక్రమంతో చాలా రూపాలుగా ప్రకటితమవుతాడు.

గుడ్డనూలుతో కూడివున్నట్లు ఈ జగత్తంతా ఆ పరమేశ్వరునిలో ఓతప్రోతభావంతో వుంది. అనాది, ప్రవృత్తిశీలం అయిన సంసారవృక్షం భోగముక్తిరూపాలైన పూలను ఫలాలను ప్రసవిస్తుంది. ఈ సంసారవృక్షానికి పాప పుణ్యాలనే రెండు బీజాలున్నాయి. అపరిమిత వాసనారాశి దీనిమూలము. సత్త్వాది గుణత్రయము కాండము. పంచభూతాలు స్కంధాలు. పదకొండు ఇంద్రియాలు శాఖలు. శబ్దాది విషయాలు అయిదు రసం. ఈ వృక్షంలో వాతపిత్తశ్లేష్మాలనే మూడువిధాల చర్మాలున్నాయి. సుఖదుఃఖాలనే రెండురకాల ఫలాలున్నాయి. జీవేశ్వరులు అనే రెండు పక్షులున్నాయి. ఈ విశాలవృక్షం సూర్యమండలం వరకు వ్యాపించివుంది. గ్రద్దలనే గృహస్థులు దుఃఖఫలాన్ని, హంసలనే సన్న్యాసులు సుఖఫలాన్ని అనుభవిస్తారు. నేను ఒక్కడినే అయినా అనేకరూపాలుగా కనిపిస్తాను. ఎవడు ఈ తత్త్వం తెలుసుకుంటాడో వాడే వేదతత్త్వం తెలిసినవాడు.

ఉద్ధవా! నువ్వుగూడ పైన చెప్పినట్లుగా గురువును సేవించు. ఒంటరిగా భక్తిగలవాడివై వాడియైన జ్ఞానగొడ్డలిచే త్రిగుణాత్మకమైన లింగశరీరాన్ని త్యజించు. పరమాత్మవస్తువును పొందు. తరువాత జ్ఞాన రూపసాధనను కూడ పరిత్యజించు.

## ఎనిమిదవ అధ్యాయము

భగవంతుడు:- ఉద్ధవా! బుద్ధికి సంబంధించినవి సత్త్వరజస్తమో గుణాలు ఆత్మకు సంబంధించినవి కావు. సత్త్వగుణం ద్వారా రజస్తమోగుణాలను జయించాలి. తర్వాత సత్త్వగుణం ద్వారా సాత్త్విక వృత్తులను జయించాలి. సత్త్వగుణం అభివృద్ధి చెందినపుడు పురుషుడికి నాపై భక్తిధర్మం పుడుతుంది సదా సాత్త్విక పదార్థాలు సేవించడం వలన సత్త్వగుణం వృద్ధి చెందుతుంది. దాని ద్వారా ధర్మం ప్రవర్తిల్లుతుంది. సత్త్వగుణాన్ని పెంచే ధర్మమే ఉత్తమమైంది. అది రజస్తమో గుణాలను నాశనం చేస్తుంది. ఆ రెండు నశించిన తర్వాత వాటికి మూలమైన అధర్మం కూడా తొందరగా నశిస్తుంది. ఆగమము, జలము, ప్రజలు, దేశము, కాలము, కర్మ, జన్మ, ధ్యానము, మంత్రము, సంస్కారము అనే ఈ పది వస్తువులు గుణాలకు కారణాలు. వీటిలో ఋషులచేత పొగడబడేవి సాత్త్వికాలు, నిందింపబడేవి తామసాలు, ఉపేక్షింపబడేవి రాజసికాలు. పురుషుడు సత్త్వగుణవృద్ధి కోసం సాత్త్వికవిషయాలనే సేవించాలి. సాత్త్వికగుణం వల్ల ధర్మం పెరుగుతుంది. ధర్మాభివృద్ధివల్ల భగవంతుని విషయంలో జ్ఞానం పెరుగుతుంది. వెదుళ్ళరాపిడి వలన కలిగిన నిప్పు తనకాశ్రయభూతమైన అడవిని కాల్చివేస్తుంది. తర్వాత తాను ఉపశమనం పొందుతుంది. అట్లే క్రియాశీలము, గుణవైషమ్యజాతమైన దేహంగూడ సహజంగా కలిగిన జ్ఞానం ద్వారా తనకాశ్రయభూతమైన గుణాలను నాశనం చేసి అది గూడ నశిస్తుంది.

ఉద్ధవుడు:- కృష్ణా! మానవులు సాధారణంగా విషయాలు కష్టాలకు కారణాలని తెలిసికూడా కుక్క, గాడిద, మేక మొదలైన జంతువుల్లాగా దుఃఖాలను అనుభవిస్తూ మళ్ళీ ఆ విషయాలనే అనుభవిస్తారు. ఎందుకు?

భగవంతుడు:- ఉద్ధవా! అవివేకి మనసులో ముందు దేహాత్మ బుద్ధిరూప మిథ్యాజ్ఞానం కలుగుతుంది.దాని ద్వారా దుఃఖాత్మకమైన రజోగుణం సత్త్వప్రధానమైన మనస్సునావరిస్తుంది. తర్వాత రజోగుణయుక్తమైన మనస్సులో సంకల్పవికల్పాలు బయలుదేరతాయి. దానివలన దుష్టబుద్ధి విషయాన్ని గురించి ఆలోచిస్తాడు తద్వారా భరించలేని విషయవాసనలు పుడతాయి. కామవశ్యుడు, రజోవేగవిమోహితుడు, అజితేంద్రియుడు అయిన పురుషుడు కర్మలవలన కలిగే ఫలము దుఃఖమేనని తెలుసుకొని కూడా మళ్ళీ వాటినే ఆచరిస్తాడు. వివేకవంతుడు రజస్తమోగుణాలచే బాధింపబడ్డా అవధానంతో మనస్సును నిగ్రహించాలి. కర్మలలో దోషముందని గ్రహించాలి. అలా గ్రహించినవాడు వాటియందాసక్తుడు కాడు. అప్రమత్తుడు, విచారరహితుడు, శ్వాసను ఆసనాన్ని జయించినవాడు అయిన పురుషుడు మూడుకాలాలలో నాపై మనస్సునుంచి మెల్లగా ఏకాగ్రత సాధించాలి. సాధకుడు తనమనస్సును అన్నిటినుండి మరల్చి ప్రత్యక్షంగా నాపై నిలుపుటే యోగమని నా శిష్యులైన సనకాది మహర్షులు వివరించారు.

ఉద్ధవుడు:- నీవెప్పుడు ఏ రూపంతో సనకాదులకు యోగాన్ని బోధించినావో ఆ కాలాన్ని, ఆ రూపాన్ని తెలుసుకోవాలనుకుంటున్నాను.

భగవంతుడు:- ఒకసారి బ్రహ్మమానసపుత్రులు సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు తండ్రి దగ్గరకు వెళ్ళి యోగంలో సూక్ష్మం ఉత్తమం అయిన స్థితిని తెలియజేయమని కోరారు.

సనకాదులు:- దేవా! మనుష్యుల మనస్సు సహజంగా విషయాల లోనికాకర్షింపబడుతుంది. విషయాలు కూడ వాసనా రూపంతో చిత్తంలో ప్రవేశిస్తాయి. కాబట్టి విషయాల బారి నుండి తప్పించుకోదలచిన ముముక్షువు విషయ, చిత్తాల పరస్పర సంబంధాన్నెలా నశింపచేయగలడు?

భగవంతుడు:- ఉద్ధవా! బ్రహ్మ స్వయంగా కారణరహితుడు, సకలభూతాలకు కారకుడు అయినా ఎల్లపుడు కర్మవిక్షిప్తచిత్తుడగుట వలన చాలారకాలుగా ఆలోచించికూడా సనకాదులడిగిన ప్రశ్నల తత్త్వాన్ని తెలిసికోలేకపోయాడు. అపుడు బ్రహ్మ పై ప్రశ్నలకు సమాధానం తెలుసుకోదలచి నన్ను స్మరించాడు. అపుడాయనకు నేను హంసరూపంలో ప్రత్యక్షమయ్యాను.

అపుడు మునులు నా హంసరూపాన్ని దర్శించి బ్రహ్మను ముందుబెట్టుకొని నా దగ్గరకు వచ్చి నమస్కారం చేసి నీవెవ్వరని ప్రశ్నించారు. యోగతత్త్వాన్ని తెలిసికోవాలని మునులీ విధంగా అడిగారు. నేను వాళ్ళకు చెప్పింది చెప్తా విను.

బ్రాహ్మణులారా! పరమార్థవస్తువు ఒకటే అయినపుడు నన్ను మీరిట్లు ప్రశ్నించడం ఎట్లు తగును? ఒకవేళ నేను సమాధానం చెప్పదలచిన ఏ జాతి గుణక్రియా సంబంధాదుల నాశ్రయించి చెప్పాలి?

దేవమనుష్యాది శరీరాలన్నీ పంచభూతాత్మకాలు. కాబట్టి వేరుకావు. పరమార్థ దృష్టితో గూడ వేరు కావు. ఇటువంటి పరిస్థితిలో నీవెవరివని అర్థరహితంగా మీరడుగుట కేవలం వాచారంభమే అవుతుంది. ప్రపంచంలో మనస్సుచేత, మాటచేత, దృష్టిచేత ఇంకా ఇతర ఇంద్రియాలచేత గ్రహించబడే విషయాలన్నీ నా స్వరూపాలే. నాకంటె వేరు కావు. ఈ సిద్ధాంతాన్ని తత్త్వవిచారం ద్వారా తెలుసుకోండి. మానవుల మనస్సు విషయాలలో, విషయాలు మనస్సులో ప్రవేశిస్తాయి. మనస్సు, విషయాలు ఈ రెండూ బ్రహ్మస్వరూపుడైన జీవుడికి ఉపాధులే గాని స్వరూపాలు కావు. అందువలన మాటి మాటికి విషయాలను అనుభవించడం వల్ల మనస్సు విషయాసక్త మవుతుంది. విషయాలు గూడ మనస్సునుండి పుట్టినవే. కాబట్టి పురుషుడు

నా స్వరూపాన్ని పొంది చిత్తాన్ని విషయాలను రెండింటిని విడవాలి. జాగ్రత్స్వప్న సుషుప్తులు మూడూ సత్త్వాది గుణాలవల్ల కలిగిన బుద్ధివృత్తులు. ఈ వృత్తులకు సాక్షిగా వుండే దానివల్ల జీవుడు వీటికంటే వేరుగా వుంటాడు. బుద్ధివృత్తి ద్వారా కలిగే సంసారబంధం జీవుడికి విషయవృత్తిని కలిగిస్తుంది. అందువల్ల తురీయచైతన్య స్వరూపుడనైన నాలో వుండి ఈ బంధాలు త్యజించాలి. వెంటనే విషయ చిత్తాల సంబంధము విడిపోతుంది. అహంకారం వల్ల కలిగే బంధమే జీవుని అనర్థాలకు గురిచేస్తుంది. విద్వాంసుడు విషయం తెలిసికొని విరక్తుడై తురీయవస్తువు నందుండి సంసారచింతను, భోగచింతను వదలాలి. యుక్తిచేత భేదజ్ఞానం నివృత్తి కానంతవరకు జీవుడు జాగరూకుడై వున్నా నిజానికి వాని జాగరూకత కలలో చూసిన జాగరణం లాగా అబద్ధమౌతుంది. పరమాత్మకంటె వేరైన శరీరాదిభావాలకు ఉనికిలేదు. ఈశరీరాల వల్ల ఏర్పడిన వర్ణాశ్రమాది భేదము, స్వర్గాదిఫలాలు వాటికి కారణాలైన కర్మలు పురుషుడు కలలో చూచే విషయాలలాగా వ్యర్థమవుతాయి. మేలుకొని వుండే సమయంలో అన్ని ఇంద్రియాల ద్వారా ప్రకటమయ్యే క్షణికాలైన బాల్యయౌవనాది ధర్మయుక్త దేహాదిస్థూల విషయాలను, కలలోని మనస్సులో జాగరణ దృష్టములైన పదార్థాల్లాగా వాసనామయ విషయాలను అనుభవించువాడు అన్ని సమయాల్లో ప్రతిసంధానముననుసరించి అనుగమించుట వలన అవస్థాత్రయానికి సాక్షి ఇంద్రియాధిష్ఠాత అయిన ఆ పరమాత్మ వస్తువొక్కటే సుషుప్తికాలంలో ఆ విషయాలనన్నిటిని ఆ జ్ఞానంలో లయం చేస్తుంది. ఈ విధంగా ఆలోచించి గుణకృతాలైన జాగరణాది మానసికావస్థలు మూడును నా అవిద్యచే నాలో కల్పించ బడ్డాయని నిర్ణయించుకొని మీరు అనుమానం చేత సదుపదేశం వల్ల కలిగిన తీక్ష్ణమైన జ్ఞానమనే ఖడ్గంతో సంశయాల కన్నింటికి ఆధారమైన అహంకారాన్ని ఛేదించండి. హృదయంలో వున్న నన్ను సేవించండి.

ఈ ప్రపంచం మనఃకల్పితం, వినశ్వరం, అలాతచక్రతుల్యం, అతిచంచలం, భ్రమ అని తెలుసుకోండి. విజ్ఞాన స్వరూపమైన బ్రహ్మమొక్కటే అనేకరకాలుగా తెలియబడుతున్నది. నిజానికి అనేకరకాలుగా లేదు. గుణపరిణామం వల్ల కలిగే జాగరణాది భేదం కలలాగా మాయావిలాసమని తెలుసుకోండి. అందువలన దృశ్యప్రపంచంనుండి దృష్టిని మరల్చి విషయతృష్ణలేని వాడుగా, మౌనిగా, మనోవాక్కాయ వ్యాపారరహితుడుగా అయి తనలోని సుఖాన్ని అనుభవించేవాడుగా కావాలి. ఎప్పుడయినా ఆహారాదుల సమయంలో ఈ దేహాది ప్రపంచం కనపడినా ఇది నిజమైన వస్తువుకంటె వేరైనదని తెలిసికొని విడువబడినది. కాబట్టి మళ్ళీ మోహాన్ని కలిగించదు. కాని మరణం వరకు ఈ సంసార రూపంలో స్మృతిమిగిలి వుంటుంది.

మదిరాపానం వల్ల పిచ్చివాడైన మనిషి తానువేసుకున్న బట్టలు శరీరంపైనున్నవా లేదా అని తెలుసుకోలేడు. అదేవిధంగా సిద్ధపురుషుడు స్వరూపాన్ని సాక్షాత్కారం చేసికొని ఈ అశాశ్వత దేహం నిలిచివున్నది, కూర్చుండినది లేక దైవానుగ్రహంతో వచ్చింది పోయింది అనే ఈ విషయాలపై దృష్టి వుంచడు. దైవవశాన గతిశీలమైన ఈ దేహం తాను చేసిన కర్మలున్నంతవరకు ప్రాణంతో ఇంద్రియాలతో కూడి తప్పకుండా జీవిస్తుంటుంది. కాని సమాధి యోగం పొందిన పరమార్థ తత్త్వజ్ఞుడైన పురుషుడు కలతో సమానమైన ఈ భౌతికదేహంలో ఆసక్తి కలిగి వుండడు.

బ్రాహ్మణులారా! సాంఖ్యయోగంలో చెప్పిన విషయాలన్నీ మీకు వివరించాను. ఆ విషయాలన్నీ మీకు ఉపదేశించడానికే నేనిక్కడకు వచ్చాను. నేను సాంఖ్యం, యోగం, సత్యం, ఋతం (మంచిమాట) తేజస్సు, శ్రీ, కీర్తి, దమం అనే వీటన్నిటికి పరమాశ్రయుడనై వున్నాను. నిత్యం అప్రాకృతమైన

సామ్యం, అసంగం మొదలైన గుణాలన్నీ నిర్గుణడను, నిరపేక్షుడను, అన్నిటమేలు కోరే వాడిని, అన్నింటిని ప్రేమించేవాడిని, సర్వాంతర్యామిని అయిన నన్ను సేవిస్తున్నాయి. సనకాదిమునులు నామాటలవల్ల సంశయాలు పోగొట్టుకున్నారు. భక్తితో నన్ను పూజించారు. స్తోత్రాల ద్వారా నామహిమను కీర్తించారు. తర్వాత ఆ మహర్షులు నన్ను చక్కగా పూజించి స్తుతించారు. అప్పుడు నేను బ్రహ్మచూస్తుండగానే నాస్థానానికి వెళ్ళాను.



## తొమ్మిదవ అధ్యాయము

ఉద్ధవుడు :– కృష్ణా ! బ్రహ్మవాదులు నానారకాలసాధనాలను చెప్పారు. వాటిలో వికల్పభావంతో అన్నీ ప్రధానములా? లేక ఒక్కటే ప్రధానమా ? దయచేసి వివరించు. నీవుపదేశించిన భక్తియోగం వల్ల మనస్సు అన్నింటిని త్యజించి నీయందే లగ్నమవుతుంది. ఆ నిష్కామ భక్తియోగం అందరికీ ఇష్టమా ? లేక నీకొక్కడికే ఇష్టమా? విశదీకరించు.

భగవంతుడు :– నాయొక్క ధర్మంతో కూడిన ఈ వేదవాణి ప్రలయకాల ప్రభావంచే మున్ను నష్టమైంది. మళ్ళీ సృష్ట్యారంభంలో దీనిని బ్రహ్మకుపదేశించాను. బ్రహ్మ తన జ్యేష్ఠ పుత్రుడైన స్వాయంభువమనువునకు దీనినుపదేశించాడు. అతని నుండి భృగువు, అంగిరసుడు, మరీచి, పులహుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనే ఏడుగురు మహర్షులు గ్రహించారు. ఈ ఏడుగురు మహర్షుల నుండి వారి సంతానమైన దేవతలు, దానవులు, గుహ్యకులు, మనుష్యులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, చారణులు, కిందేవులు, కిన్నరులు, నాగులు,రాక్షసులు, కింపురుషులు మొదలైన వారందరు దానిని గ్రహించారు. అన్నిజీవుల వాసనలు త్రిగుణాల ననుసరించి వేరువేరుగా వుంటాయి. ఈ వాసనలబట్టి దేవాసుర మనుష్యాది భూతాలు, భూతపతులు వేరువేరుగా వుంటారు.వారి వాసనలరీతిగా చిత్రములైన వేదవ్యాఖ్యలు బయటపడుతున్నాయి.

ఈ విధంగా మానవుల స్వభావభేదాన్ననుసరించి వారి బుద్ధిలో కూడ భేదమేర్పడింది. కొందరు వేదాధ్యయనం చేయకుండ పరంపరననుసరించి భిన్నాభిప్రాయాలు కలవారైనారు కొందరు ఏ ఆలోచన లేక పాషండ మతాన్నవలంబిస్తారు. మానవులు నామాయవల్ల మోహితులై వారి రుచి

కర్మల భేదాన్ననుసరించి అనేకరకాల శ్రేయస్సాధనాలను వర్ణిస్తారు. వారిలో కొందరు ధర్మాన్ని, కొందరు యశస్సును, కొందరు కామాన్ని కొందరు సత్యాన్ని, కొందరు దమాన్ని, కొందరు శమాన్ని, కొందరు ఐశ్వర్యాన్ని, కొందరు దానభోగాలను, కొందరు యజ్ఞతపోదాన వ్రతయమనియమాలు మొదలైన వాటిని శ్రేయస్సుకు సాధనాలని చెప్తున్నారు.

ముందు చెప్పబడిన మానవుల కర్మలవలన కలిగిన లోకాలు అనిత్యాలు, దుఃఖహేతుకాలు, మోహాన్ని కలిగించేవి, నీచమైనవి, హీనమైనవి, శోకమయాలు, నాపై మనస్సు నిలిపి విషయవాసనలు లేనివారు నా పరమానందస్వరూపాన్ని తెలిసికొంటారు. కాబట్టి విషయబుద్ధిగలవారు సుఖాన్ని పొందలేరు.

అకించనుడు, శమదమయుక్తుడు, సమమనస్కుడు, ఆత్మపరితృప్తుడు అయిన పురుషుడికి యావత్ప్రపంచం సుఖమయంగా గోచరిస్తుంది. నాపై చిత్తాన్నుంచిన మానవుడు నన్ను తప్ప ఇతరాలైన బ్రహ్మపదవినిగాని, ఇంద్రపదవినిగాని, సార్వ భౌమపదవినిగాని, రసాధిపత్యాన్నిగాని, అణిమాదియోగసిద్ధినిగాని లేకమోక్షపదవినిగాని కోరడు. నీవు నాకిష్టుడవైనట్లుగ బ్రహ్మగాని, శంకరుడుగాని, బలరాముడుగాని, లక్ష్మీదేవిగాని నాకిష్టులు కారు. నిరపేక్షుడు, మౌని, శాన్తుడు,వైరంలేనివాడు, సమదృష్టిగలవాడు అయిన భక్తుని పాదధూళిద్వారా లోకాలను పావనం చేయాలని అతణ్ణి అనుసరిస్తాను. అకించనులు, శాంతులు, అభిమానరహితులు, జీవులపై వాత్సల్యం గలవారు, విషయరాగం లేనివారు అయిన పురుషులు నాయందే మనస్సు నిలిపి నన్నుసేవిస్తారు. అలాంటివారే నిరపేక్షులైన ప్రజలు పొందే సుఖాన్ని పొందుతారు. ఇతరులెవ్వరు దానిని పొందలేరు. ఇంద్రియాలను జయించలేని భక్తుడు విషయాలకు ఆకర్షితుడైనా,

నాయందలి దృఢభక్తి వల్ల విషయాలకు లొంగడు.

బాగా జ్వలించే అగ్ని కట్టెల సమూహాన్ని తగులబెట్టి బూడిద చేస్తుంది. అలాగే నాపై గల భక్తి అన్నిపాపాలను సమూలంగా నాశనం చేస్తుంది. భక్తి నన్ను వశం చేసికొన్నట్లుగా యోగం, సాంఖ్యం, ధర్మం, స్వాధ్యాయం, తపస్సు, దానం మొదలైనవి నన్నువశం చేసుకోలేవు. శ్రద్ధవల్ల కలిగిన భక్తిప్రభావం చేతనే పరమాత్ముడను, ప్రియస్వరూపుడను అయిన నేను మంచివాళ్ళకు దొరుకుతున్నాను. ఏకాగ్రత కలిగిన భక్తి పంచములను కూడ పావనం చేస్తుంది. నాపై భక్తిలేని వాని మనస్సును సత్యం, దయ, ధర్మం, తపస్సు, జ్ఞానం ఇవేవి సరిగా పవిత్రం చేయలేవు. శరీరం పులకించనంతవరకు, మనస్సు కరిగి గద్గదం కానంతవరకు, ఆనంద బాష్పాలు జాలువారనంతవరకు భక్తి కలుగదు. భక్తి కలుగనిదే మనస్సు శుద్ధం కాదు. నా పై భక్తి కలవానికి మాట గద్గదంగా వుంటుంది. వాని మనస్సు ద్రవిస్తుంది. ఒక్కొక్కసారి ఏడుస్తుంటాడు. ఒక్కొక్కసారి నవ్వుతుంటాడు. సిగ్గుపడకుండా పెద్దగా పాటలు పాడుతుంటాడు. నృత్యం చేస్తుంటాడు. ఇలాంటి భక్తుడు మూడులోకాలను పావనం చేస్తాడు.

అగ్నితో కాల్చబడిన బంగారం లోపలి కలుషితాన్ని వదలి సహజప్రకాశాన్ని పొందుతుంది. అట్లే మానవుల మనస్సు గూడ నాపై భక్తివల్ల కర్మవాసనలు వదలి నన్నే భజిస్తుంది. కాటుకవల్ల కంటికి దోషం పోయి చిన్నవస్తువులు చూచేశక్తి కలుగుతుంది అలాగే పరమపావనమైన నాలీలలను వినడం వల్ల కీర్తించడం వల్ల మనస్సులోని మాలిన్యం పోతుంది. విషయాలను గురించి ఆలోచించే వాడి మనస్సు విషయాలలోనే లీనమై వుంటుంది. నాగురించి ఆలోచించేవాడి మనస్సు నాయందే లీనమై వుంటుంది. కాబట్టి కలలో కనిపించే కోరికలతో సమానాలైన ఇతర

అసత్సాధనాలను వదలి నాయందు మనస్సు నిలుపు. వివేకవంతుడు స్త్రీలసాంగత్యాన్ని, వాళ్ళను ప్రేమించే వాళ్ళ సాంగత్యాన్ని దూరంగా వదలి, నిర్మానుష్యంగా వున్నచోట కూర్చొని సావధానంగా నన్ను ధ్యానిస్తాడు. స్త్రీలసాంగత్యం వల్ల, వాళ్ళతో తిరిగే వాళ్ళ సాంగత్యం వల్ల మనిషికి కష్టాలు, బంధాలు కలుగుతున్నాయి. ఇలాంటి కష్టాలు, బంధాలు ఇంకే ఇతర విషయప్రసంగాల వల్ల కలుగవు.

ఉద్ధవుడు :- పుండరీకాక్షా ! ముముక్షువులైన పురుషులు నిన్ను ఏరూపంలో, ఏ విధంగా, ఏభావంతో ధ్యానిస్తారో దయచేసి వివరించు.

భగవంతుడు :- సమమైన ఆసనమునందు సమశరీరం కలవాడై సుఖంగా కూర్చొని చేతులను ఒడిలో పెట్టుకొని దృష్టిని నాసాగ్రమందుంచాలి. జితేంద్రియుడు పూరక కుంభక రేచకాలచేత, రేచక కుంభక పూరకాలచేత ప్రాణ వాయుమార్గాన్ని శోధించాలి. ప్రాణాయామాభ్యాసాన్ని క్రమక్రమంగ పెంచుకోవాలి. మూలాధారం నుండి తామరతూడులోని దారంలాగా తెగనిభావంతో హృదయంలో వుండే ఘంటాశబ్దం వంటి ఓంకారమును ప్రాణవాయువుతో కూడ పైకి 12 అంగుళాలవరకు తీసికొనిపోయి దానితో స్వరాన్ని కలపాలి. ఈ విధంగా ప్రతిరోజు మూడుపూటలా పదిసార్లు ఓంకారంతో కూడ ప్రాణాయామాన్నభ్యసిస్తే ఒకే మాసంలో ప్రాణవాయువు స్వాధీనమవుతుంది. దేహాంతర్గతం, ఊర్ధ్వనాళవిశిష్టం, ముకుళితం, కర్ణికాయుక్తిం, అష్టదళయుక్తం, వికసితం అయిన హృత్పుండరీకాన్ని ధ్యానించాలి. కర్ణికలో క్రమంగా సూర్యచంద్రులను, అగ్నిని వుంచాలి. తర్వాత అగ్నిలో ధ్యానమంగళమైన నా ఈ రూపాన్ని ధ్యానించాలి. సమమైనది, ప్రశాన్తమైనది, మంచి ముఖంకలది, పొడవాటి అందమైన భుజములు కలది, అందమైన మెడకలది, మంచి చెక్కిళ్ళుకలది,

చిరునవ్వుకలది, చెవులందు సమానంగా వుంచబడిన ప్రకాశవంతములైన మకరకుండలములు కలది, కనక వస్త్రం కలది, జలదనీల కాంతి గలది, శ్రీ వత్సానికి లక్ష్మికి ఆలయమైనది, శంఖచక్ర గదాపద్మ వనమాలతో భూషింపబడినది, నూపురశోభిత పాదాలు గలది, కౌస్తుభ కాంతితో కూడినది, కాంతిగల కిరీట కటక కటి సూత్రాంగదములతో కూడినది. సర్వాంగ సుందరం, హృద్యం, ప్రసాదసుముఖేక్షణ, అతికోమలం అయిన నారూపాన్ని ధ్యానించు, నీమనస్సును అన్ని అవయవాలలోను లగ్నం చేయి.

బుద్ధిమంతుడు మనస్సు ద్వారా ఇంద్రియాలను వాటి విషయాల నుండి మరలించి బుద్ధి అనే సారథి ద్వారా ఆమనస్సును నాలో లగ్నం చేయాలి. తర్వాత సర్వవ్యాపకమైన మనస్సునాకర్షించి ఒకే అంగము నందుంచాలి. మళ్ళీ ఇతరావయవాలను ధ్యానించకుండా సుందర హాస్యయుక్తమైన ముఖమండలాన్నే ధ్యానించాలి. తర్వాత ముఖమునందుండే మనస్సును ఆకాశమునందుంచాలి. తర్వాత ధ్యానాన్ని కూడా విడచి శుద్ధబ్రహ్మమైన నాపై మనస్సునుంచాలి. ఇంకే వస్తువును ధ్యానించకూడదు. ఇట్లే సమాహితచిత్తుడైన పురుషుడు ఒకదీపంలో ఇంకొక దీపాన్ని దర్శించినట్లు బ్రహ్మస్వరూపుడనైన నన్ను జీవాత్మలోను, సర్వాత్మస్వరూపుడనైన నాలో జీవాత్మను దర్శించాలి.

ఈ విధంగా తీవ్రమైన ధ్యానయోగం ద్వారా నాపై మనస్సును లగ్నంచేసిన యోగియొక్క, ద్రవ్య, జ్ఞాన, క్రియాభ్రమ అంటే ఆధిభౌతికం, ఆధిదైవికం, ఆధ్యాత్మికం అనే మూడుభ్రమలు వెంటనే నశిస్తాయి.



## పదవ అధ్యాయము

భగవంతుడు :- ఇంద్రియాలను జయించినవాడు, చిత్తనిగ్రహం కలవాడు, శ్వాసనుజయించినవాడు అయిన యోగి నాపై మనస్సు నిలుపుతాడు. అణిమాదిసిద్ధులు అతనికి ప్రాప్తిస్తాయి.

ఉద్ధవుడు :- అచ్యుతా! ఏ ధారణచేత ఏవిధంగా ఎటువంటి సిద్ధి లభిస్తుంది? అవి ఎన్ని? నీవు యోగులకు సిద్ధులనిచ్చేవాడివి కాబట్టి వివరించు.

భగవంతుడు: ఉద్ధవా! యోగులు అష్టాదశసిద్ధులు వివరించారు. వాటిలో ముఖ్యమైనవి ఎనిమిది. అవినాలో వున్నాయి. మిగిలిన పదిసిద్ధులు గుణానికి హేతువులుగా వున్నాయి.

అణిమ, మహిమ, లఘిమ అనేవి దేహానికి సంబంధించినవి. ప్రాప్తి అనేది ఇంద్రియాధిష్ఠాతృదేవతలకు సంబంధించినది. ప్రాకామ్యమనేసిద్ధి లౌకికపారలౌకిక పదార్థాలననుభవించేది. ఈశితమనేసిద్ధి శక్తి సమూహానికి ప్రేరణ కలిగించేది. వశిత అనే సిద్ధి విషయాలలోనే వుంటూ వాటిపై ఆసక్తిలేనిది. కామావసాయిత అనేది కోరిన కోర్కెలను తీర్చేది. ఈ ఎనిమిది సిద్ధులు స్వాభావికాలు, నిరతిశయాలు అని చెప్పబడ్డాయి.

ఈ శరీరంలో ఆకలి, దాహంలాంటివి లేకపోవడం, దూరంగావుండే విషయాలను వినడం, చూడడం, ఇష్టమొచ్చినచోటికి మనోవేగంతో పోవడం, ఇష్టమొచ్చిన రూపాన్ని ధరించడం, పరకాయ ప్రవేశం చేయడం, స్వచ్ఛందంగా శరీరాన్ని వదలడం, దేవతలను క్రీడను దర్శించడం, సంకల్పసిద్ధి, అప్రతిహతమైన ఆజ్ఞ అనే ఈ పదిగుణాలు కూడ సిద్ధులని తెలుసుకో. త్రికాలజ్ఞానం, శీతోష్ణాది సహిష్ణుత్వం, పరచిత్తాదివిషయక జ్ఞానం,

అగ్నిసూర్యజల విషాదుల ప్రభావస్తంభనం, పరాజయం లేకుండడం ఈ ఐదూ క్షుద్రసిద్ధులు. యోగధారణవలన కలిగే సిద్ధులపేర్లు, లక్షణాలు చెప్పాను. ఇప్పుడు ఏ ధారణ ద్వారా ఏ సిద్ధి ఎలా కలుగుతుందో చెప్తా విను.

సూక్ష్మభూతరూప ఉపాధిలో వున్న నాలో సూక్ష్మ భూతాకారమైన మనస్సును ప్రవేశపెట్టినవాడు తన్మాత్రోపాసకుడై నా అణిమసిద్ధిని పొందుతాడు. మహత్తత్త్వరూప ఉపాధిలో వున్న నాలో అటువంటి మనస్సును పెట్టినవాడు మహిమసిద్ధిని పొందుతాడు. ఈ విధంగానే ఆకాశాదిభౌతిక ఉపాధులలో మనస్సును ప్రవేశపెట్టుటద్వారా వాటికి తగ్గట్టుగానే మహిమసిద్ధి కలుగుతుంది. గాలి మొదలైన నాలుగుభూతాలకు సంబంధించిన పరమాణురూపమైన ఉపాధులలో వున్ననాలో మనస్సు లగ్నం చేసిన యోగి కాల సంబంధమైన సూక్ష్మపరమాణువుతో సమానమైన లఘిమ అనే సిద్ధిని పొందుతాడు. వైకారికాహంకార రూప ఉపాధిలో వున్ననాలో తదేకంగా మనస్సునుంచిన యోగి అన్ని ఇంద్రియాల కధిష్ఠాతగా వున్న ప్రాప్తి అనే సిద్ధిని పొందుతాడు. క్రియాశక్తిప్రధానమైన మహత్తత్త్వరూప ఉపాధిలోవున్న నాపై మనస్సునర్పించిన యోగి అవ్యక్తజన్ముడనైన నాకు సంబంధించిన ప్రాకామ్య సిద్ధిని పొందుతాడు. విష్ణురూపుడను, త్రిగుణాధీశుడను, కాలవిగ్రహుడను అయిన నాపై మనస్సు నుంచినవాడు జీవులకు, వాటి ఉపాధులకు ప్రేరణ కలిగించే ఈశిత్వసిద్ధిని పొందుతాడు. నారాయణుడను, తురీయాఖ్యుడను, భగవానుడను అయిన నాపై మనస్సునుంచిన యోగి నాయొక్క ధర్మయుక్తుడై వశిత్వమనే సిద్ధిని పొందుతాడు. నిర్విశేష బ్రహ్మస్వరూపుడనైన నాపై మనస్సునుంచిన వాని అన్ని కోరికలు సమాప్తమవుతాయి. కాబట్టి అతడు పరమానందాన్ని పొందుతాడు.

శ్వేతద్వీపపతిని, చిత్తశుద్ధుడను, ధర్మానుష్ఠాతను అయిన నాపై మనస్సు నిలిపిన మానవుడు ఆకలి-దప్పికలు మొదలుగాగల షడూర్ములు లేకుండా శుద్ధరూపం పొందుతాడు. ఆకాశమే ఉపాధిగా వున్న నాపై మనస్సుతో నాదచింతనం చేసే జీవుడు ఆకాశంలో వ్యక్తమయ్యేప్రాణుల శబ్దాలను దూరం నుండే వింటాడు. సూర్యమండలంలో కళ్ళను, కళ్ళల్లో సూర్యుని కలిపి ఈ రెండింటి ద్వారా నన్ను ధ్యానించే యోగి దూరంనుండే అన్ని వస్తువులను చూస్తాడు. మనోదేహాలను ప్రాణవాయువుతో గూడ నాతో కలిపి నన్ను ధ్యానించేవాడు మనోజవ సిద్ధిని పొందుతాడు. దీని ప్రభావం వల్ల అనుకున్న ప్రదేశానికి క్షణంలో పోతాడు. మనస్సును ఉపాదానకారణం చేసి యోగి తాను యేయే రూపాలను ధరించతలస్తే అటువంటి రూపాలను తనకనుకూలంగా ధరిస్తాడు. నాపై మనస్సు లగ్నం చేసే యోగి ఇలాంటి కార్యాలు చేయగల సమర్థుడు. పరకాయప్రవేశం చేయాలనుకునే యోగి తానా శరీరంలోనే వున్నానని భావిస్తాడు. పుష్పంనుండి ఇంకొక పుష్పంపైకి పోయే తుమ్మెద లాగా ప్రాణప్రధాన లింగ శరీరోపాధియుక్తమైన ఆత్మ వెలుపలిదైన వాయుమార్గం గుండా పరకాయంలో ప్రవేశిస్తుంది. కాలిమడమతో గుదద్వారాన్ని నిరోధించి ప్రాణోపాధియైన ఆత్మను క్రమంగా హృదయవక్షఃస్థల కంఠ శిరోభాగాలకు తీసుకొని పోవాలి. అక్కడనుండి బ్రహ్మరంధ్రంద్వారా బ్రహ్మవస్తువుతో కలిపి శరీరాన్ని విడవాలి. యోగి దేవతలు తిరిగే స్థలాల్లో తిరగాలనుకుంటె శుద్ధ సత్త్వభావన చేయాలి. ఆ విధంగా చేసిన సత్త్వగుణాంశ స్వరూపులైన దేవతా స్త్రీలు విమానాలలో ఎక్కి వాడి దగ్గరకు పోతారు. సత్యసంకల్పుడనైన నాపై మనస్సు వుంచి శ్రద్ధ చూపే యోగి మనస్సులో ఏ విషయాలు అనుకుంటే ఆ విషయాలు పొందుతాడు. నియంతను, వశీకర్తను అయిన నన్ను ధ్యానించడం ద్వారా

యోగి ఈశితత్త్వశక్తిని పొందుతాడు. అతని ఆజ్ఞ నా ఆజ్ఞలాగా సర్వత్ర నిరాటంకంగా వ్యాపిస్తుంది. యోగి నాపై భక్తితో మనస్సు నిలిపితే శుద్ధుడవుతాడు. అతని బుద్ధి జననమరణవిషయాలను తెలుసుకుంటుంది. నీటిలో వుండే ప్రాణులు నీటివల్ల చనిపోవు. ఆ విధంగానే భక్తుడు, శాంతచిత్తుడు అయిన మునిశరీరం అగ్న్యాదులవల్ల నాశాన్ని పొందదు. ధ్వజ, ఆతపత్ర, వ్యజన, శ్రీవత్సాలతో శంఖచక్రగదా పద్మాద్యాయుధాలతో అలంకరింపబడిన నా అవతారాలను ధ్యానించే భక్తుడు అజేయుడైవుంటాడు. ముందు చెప్పిన యోగధారణలద్వారా నన్నుపాసించేవానికి వివరించిన సిద్ధులన్నీ కలుగుతాయి. జితేంద్రియుడు, దాంతుడు, శ్వాసనిఃశ్వాసాలను, ఆత్మను జయించినవాడు, నా గురించి ధారణ చేసేవాడు అయిన పురుషునికి లభించని సిద్ధి ఏదీ వుండదు. ఉత్తమ భక్తియోగాన్ననుసరించి నా అంశసంపదను పొందాలని కోరుకునేవాడికి ముందు చెప్పిన సిద్ధులు విఘ్నాలవుతాయి. ఈ సిద్ధులవలన అతని సమయం వ్యర్థమవుతుంది.

ఈ లోకంలో జన్మ, ఓషధి, తపస్సు, మంత్రం మొదలైన సిద్ధులన్నీ నా ధారణ అనే యోగం వల్ల లభిస్తాయి. ఇతర ఉపాయాలవల్ల సాలోక్యాది సిద్ధులు లభించవు. నేను అన్ని సిద్ధులకు, యోగాలకు, సాంఖ్యానికి, ధర్మానికి, బ్రహ్మవాదులకు కారణభూతుడను, పాలకుడను, ప్రభు స్వరూపుడను అయివున్నాను. అన్ని మహాభూతాలు అన్ని భౌతికపదార్థాలలో వున్నట్లు నేను గూడ అన్ని ప్రాణులలో బాహ్యరూపునిగా, అంతరాత్మరూపునిగా ప్రకాశిస్తున్నాను.



## పదకొండవ అధ్యాయము

ఉద్ధవుడు:– దేవా! నీవు అనాదివి, అనంతుడవు, ఆవరణలేని వాడవు, సాక్షాత్పరబ్రహ్మవు, అన్ని పదార్థాల సృష్టిస్థితిలయాలకు కారణస్వరూపుడవు. వేదభావం తెలిసినవాళ్ళు ఉత్తమాధమ ప్రాణులన్నింటిలో వుంటున్నవాడివి, పాపాత్ములు తెలుసుకొనలేనివాడివి అయిన నీ యథార్థరూపాన్నారాధిస్తారు. పరమఋషులు ఏయే భూతాలలో నిన్ను భక్తితో ఉపాసిస్తారో దానిని నాకు వివరించు. అన్ని ప్రాణులను కాపాడేనీవు అన్ని భూతాలలో అంతర్యామిగా వున్నావు. వాటిలో రహస్యంగా సంచరిస్తున్నావు. అన్ని భూతాలు మోహానికి గురియై అన్నింటిని చూచే నిన్ను చూడలేకపోతున్నాయి. ఐశ్వర్యసంపన్నా! దేవా! స్వర్గలోకంలో, మృత్యులోకంలో, పాతాళలోకంలోను, దిఙ్మండలంలోను వున్న నీలీలావిభూతుల గురించి నాకు వివరించు. అన్ని తీర్థాలకు ఆశ్రయమైన నీ కాళ్ళకు నమస్కరిస్తున్నాను.

భగవంతుడు:– ప్రశ్నించడంలో శ్రేష్ఠుడవైన ఉద్ధవా! కురుక్షేత్రంలో అర్జునుడు ఇదే ప్రశ్న నన్నడిగాడు. నేను రాజ్యంకోసం నాబంధువులను చంపాల్సివచ్చింది. ఇది నిందనీయం, అధర్మం అని తెలిసికొని నివృత్తుడైనాడు. నేనాసమయంలో తగు ఉపదేశాన్నిచ్చి అతనికి యథార్థ తత్త్వాన్ని బోధించాను. ఇపుడు నీవడిగిన ప్రశ్ననే అర్జునుడు యుద్ధభూమిలో అడిగాడు, నేనన్ని ప్రాణులకు పరమాత్మను, మేలుకోరేవాడిని, ఈశ్వరుడను, సర్వవిధవ్యవహారజనకుడను, సృష్టిస్థితిలయకారకుడను, గతిశీలాలైన పదార్థాలలో పరమగతిని, వశం చేసుకొనే వాళ్ళల్లో కాలస్వరూపుడను, సత్త్వాదిగుణాలలో ప్రకృతిని, గుణవంతాలైన వస్తువులలో సూత్రాత్ముడను, మహత్పదార్థాలలో మహత్తత్త్వాన్ని, సూక్ష్మపదార్థాలలో జీవుడను, దుర్జయాలైన

పదార్థాలలో మనస్స్వరూపుడను వేదాధ్యాపకులలో హిరణ్యగర్భుడను, మంత్రాలలో ఓంకారాన్ని, అక్షరాలలో అకారాన్ని, ఛందస్సులలో త్రిపదాగాయత్రీస్వరూపుడను, దేవతలలో ఇంద్రుణ్ణి, వసువులలో అగ్నిని, ఆదిత్యులలో విష్ణువును, రుద్రులలో నీలలోహితుడను, బ్రహ్మర్షులలో భృగువును, రాజర్షులలో మనువును, దేవర్షులలో నారదుణ్ణి, ధేనువులలో కామధేనువును, సిద్ధేశ్వరులలో కపిలుడను, పక్షులలో గరుడుడను, ప్రజాపతులలో దక్షుడను, పితృగణాలలో అర్యముడను, దైత్యులలో దైత్యరాజైన ప్రహ్లాదుడను, నక్షత్రౌషధాలలో సోముడను, యక్షరాక్షసులలో కుబేరుడను, ఏనుగులలో ఐరావతాన్ని, జలచరాలలో వాటికి ప్రభువైన వరుణుడను, తాపనశీలాలు, దీప్తిశీలాలైన పదార్థలలో సూర్యుడను, మనుష్యులలో భూపతిని, అశ్వాలలో ఉచ్చైఃశ్రవాన్ని, ధాతువులలో బంగారాన్ని, దండించువారిలో యముడను, సర్పాలలో వాసుకిని, నాగేంద్రులలో అనంతుడను, కొమ్ములు కోరలు వున్న ప్రాణులలో సింహాన్ని, ఆశ్రమాలలో సన్న్యాసాశ్రమాన్ని, వర్ణాలలో బ్రాహ్మణవర్ణాన్ని, తీర్థాలలో నదులలో గంగను, జలాశయాలలో సముద్రాన్ని, అస్త్రశస్త్రాలలో ధనస్సును, ధనుర్ధారులలో త్రిపురారి అయిన శంకరుడను, నివాసస్థానాలలో మేరువును, దుర్గమస్థానాలలో హిమాలయాన్ని, వృక్షాలలో అశ్వత్థవృక్షాన్ని, ఓషధులలో యవధాన్యాన్ని, పురోహితులలో వశిష్ఠుడను, వేదజ్ఞులలో బృహస్పతిని, సేనాపతులలో కార్తికేయుడను, సన్మార్గప్రవర్తకుల్లో బ్రహ్మను, యజ్ఞాలలో బ్రహ్మయజ్ఞ స్వరూపుడను, వ్రతాలలో అహింసావ్రతాన్ని, శుద్ధం చేసే పదార్థాలలో గాలి, నీరు, నిప్పు, సూర్యుడు, వాక్కు నేనే.

అష్టాంగయోగాలలో సమాధిస్వరూపుడను, జయాన్ని కోరే పురుషులలో మంత్రస్వరూపుడను, అన్ని కౌశలాలలో ఆన్వీక్షికీ

విద్యాస్వరూపుడను, ఖ్యాతివాదులలో వికల్పస్వరూపుడను, స్త్రీలలో శతరూపను, పురుషులలో స్వాయంభువ మనువును, మునులలో నారాయణుడను, బ్రహ్మచారులలో సనత్కుమారుడను, ధర్మాలలో సన్న్యాసిని, అభయస్థానాలలో అంతర్నిష్ఠాస్వరూపుడను, రహస్యవస్తువులలో ప్రియభాషణ స్వరూపుడనైన మౌనస్వరూపుడను, మిథునాలలో ప్రజాపతిని, కాలములో సంవత్సర స్వరూపుడను, ఋతువులలో వసంత ఋతువును, మాసాలలో మార్గశీర్షాన్ని, నక్షత్రాలలో అభిజిత్తును, యుగాలలో కృతయుగాన్ని, ధీరులలో దేవలుడను, అసితుడను, వేదవిభాగ కర్తలలో ద్వైపాయనుడను, పండితులలో వివేకి అయిన శుక్రాచార్యుడను, భగవంతులలో వాసుదేవుడను, భక్తులలో ఉద్ధవుడను, కింపురుషులలో హనుమంతుడను, విద్యాధరులలో సుదర్శనుడను, రత్నాలలో పద్మరాగాన్ని, అందమైన వస్తువులలో పద్మకోశాన్ని, దర్భలలో కుశాన్ని, హవ్యాలలో ఆవునెయ్యిని, వర్తకులలో వుండే లక్ష్మిని, దుర్మార్గులలో ద్యూతాన్ని, కష్టాలను సహించేవారిలో వుండే క్షమాగుణాన్ని, సాత్త్వికులలో వుండే సత్త్వగుణాన్ని నేనే.

బలాఢ్యులలో వుండే ఉత్సాహము, పరాక్రమము, భక్తులలో వుండే భక్తిసహిత నిష్కామకర్మ నా స్వరూపాలే. నవసాత్త్వతమూర్తులలో ఆదిదేవుడైన వాసుదేవుడను నేనే. గంధర్వులలో విశ్వావసుడను, అప్సరసలలో పూర్వచిత్తిని, భద్రాలలో స్థైర్యాన్ని, పృథ్విలో గంధతన్మాత్రాన్ని, జలములలో రసమును, తేజస్సుగలవారిలో సూర్యుడను, సూర్యచంద్రతారకాగణాలలో ప్రభను, ఆకాశంలో పరమశబ్దాన్ని, బ్రాహ్మణ భక్తులలో విరోచన కుమారుడైన బలిని, వీరులలో అర్జునుడను, ప్రాణులలో ఉత్పత్తిస్థితిలయ స్వరూపుడను, పాదాలలో గమన శక్తిని, వాక్కులో మాట్లాడే శక్తిని, పాయువులో మలవిసర్జన శక్తిని, చేతులలో గ్రహణశక్తిని, జననేంద్రియంలో సంతోషోపభోగశక్తిని, చర్మంలో

స్పర్శశక్తిని, కంటిలో దర్శన శక్తిని, నాలుకలో ఆస్వాదనశక్తిని, చెవులలో శ్రవణశక్తిని, నాసికలో ఆఘ్రాణశక్తిని నేనే.

రూప రస గంధ స్పర్శ శబ్దాలు, పంచతన్మాత్రలు, అహంకారం, మహత్తత్త్వం, పంచమహాభూతాలు, ఏకాదశేంద్రియాలు, పురుషుడు, ప్రకృతి, సత్త్వరజస్తమస్సులు, పరబ్రహ్మము నేనే. ఈ సర్వపదార్థ పరిగణనం, జ్ఞానం, వాటి ఫలమైన తత్త్వ నిర్ణయాన్ని నేనే.

నేను ఈశ్వరుడను, జీవుడను, గుణాన్ని, గుణిని, క్షేత్రజ్ఞుడను, సర్వాత్మకుడను. నేను లేని పదార్థమేదీలేదు. ఒకనాటికి ఈ పరమాణువుల నన్నింటినీ లెక్కపెట్టగలను. అయినా అసంఖ్యాకములైన బ్రహ్మాండాలను సృష్టించే నా లీలా విభూతులను నేను కూడా లెక్కపెట్టలేను. వస్తువులలో వుండే తేజస్సు, శ్రీ, కీర్తి, ఐశ్వర్యం, లజ్జ, త్యాగం, సౌందర్యం, సౌభాగ్యం, పరాక్రమం, తితిక్ష, విజ్ఞానం మొదలైన శ్రేష్ఠగుణాలన్నీ నా అంశాలే.

ఉద్ధవా! నీవడిగిన ప్రశ్నలకు సంగ్రహంగా సమాధానం చెప్పాను. ఇవి పరమార్థవస్తువులు కావు. మనోవికారమాత్రాలు, వాఙ్మాత్రకథితాలు, ఆకాశ కుసుమాది పదార్థ సమానాలు కాబట్టి ఇవి అభినివేశం చూపాల్సినవి కావు.

కావున వాక్కును, మనస్సును, ప్రాణాలను, ఇంద్రియాలను సంయమనం చేయి. సత్త్వసంపన్నమైన బుద్ధిద్వారా బుద్ధిని సంయమనం చేయి. అందువల్ల మళ్ళీ సంసారపథంలో పడనవసరంలేదు. బుద్ధి ద్వారా వాఙ్మనస్సులను చక్కగా సంయమనం చేయకపోతే వ్రతాలు, తపస్సు, దానం మొదలైన అనుష్ఠానాలన్నీ పచ్చికుండలో నీరులాగా నష్టప్రాయాలు.

కాబట్టి నా భక్తుడు భక్తిసహిత బుద్ధి ద్వారా వాక్కును, మనస్సును, ప్రాణాలను సంయమనం చేసే కృతకృత్యుడవుతాడు.

## పండ్రెండవ అధ్యాయము

ఉద్ధవుడు:- దేవా! ఇంతకుముందు వర్ణాశ్రమాచారాలను ఆచరించేవాళ్ళకు, ఆచరించనివాళ్ళకు నీ భక్తిరూపధర్మాన్ని వివరించావు. ఎటువంటి అనుష్ఠానంవల్ల పైన చెప్పిన భక్తి దొరుకుతుందో వివరించు.

నీవు మొదట హంసరూపంతో అవతరించి బ్రహ్మకు పరమధర్మాన్ని ఉపదేశించావు. చాలా కాలం గడచిపోయింది కాబట్టి ఇపుడా ఉపదేశం లేదు. భువిలో, బ్రహ్మసభలో ఈ ధర్మాన్ని చెప్పేవాడు, ప్రవర్తింపజేసేవాడు, కాపాడేవాడు నీ ఒక్కడివే. ఈ ధర్మానికి వక్తవైన నీవు ఈ భూమిని త్యజిస్తే లోపించే ఈ ధర్మాన్ని ఎవరు వివరిస్తారు? సర్వధర్మమర్మజ్ఞా! మనుష్యులలో ఈ భక్తిలక్షణం ఎవరికి ఎట్లా విహితమై వుందో వివరించు.

శుకుడు:- భక్తుడైన ఉద్ధవుడు ఈవిధంగా ప్రశ్నించగానే భగవంతుడు ప్రసన్నుడై ప్రాణులమేలుకోరి సనాతనమైన భాగవతధర్మాలను ఈవిధంగా ఉపదేశించాడు.

భగవంతుడు:- ఉద్ధవా! నీ వడిగిన ప్రశ్న ధర్మసమ్మతం భక్తులకిది శ్రేయస్కరం. కాబట్టి చెప్తా విను. తొలుత కృతయుగంలో మనుషులకు 'హంస' అనే వర్ణం ఒకటే వుండినది. అపుడు మానవులు పుట్టుక వలననే అనన్యభక్తిపరాయణులై కృతకృత్యులైనారు. అందువల్ల ఆయుగాన్ని కృతయుగమని పండితు లన్నారు. అపుడు వేదం ప్రణవాత్మకమై వుండినది. నేను నాలుగు పాదాలతో వృషభంలా వుండినాను. అపుడు యజ్ఞాదులు లేవు. తపోనిష్ఠులు నా హంసరూపాన్ని ధ్యానించినారు. త్రేతాయుగంలో నా ప్రాణంనుండి, హృదయంనుండి ఋగ్యజుస్సామవేదాలనుండి ఆవిర్భవించాయి. ఆ మూడింటినుండి హౌత్ర, అధ్వర్యవ, ఔద్గాత్రాలనే

మూడువిధాల యజ్ఞరూపాలు ధరించాను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు విరాట్పురుషుని ముఖంనుండి, బాహువులనుండి, ఊరువులనుండి, పాదాలనుండి క్రమంగా జన్మించారు. నా జఘన, హృదయ, వక్షఃస్థల, మస్తకప్రదేశాలనుండి గృహస్థ, బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలు క్రమంగా ఆవిర్భవించాయి.కాబట్టి వర్ణాశ్రమాలలోని మనుషుల స్వభావాలు వాళ్ళ వాళ్ళ జన్మస్థలాన్నిబట్టి ఉత్తములుగా అధములుగా వుంటారు.

శమం, దమం, తపస్సు, శౌచం, సంతోషం, క్షమ, సరళత్వం నాపై భక్తి, దయ, సత్యం, ఇవన్నీ బ్రాహ్మణస్వభావాలు. తేజస్సు, బలం, శౌర్యం, ఐశ్వర్యం, ధైర్యం, ప్రభావం, సహిష్ణుత, ఔదార్యం, ఉద్యమం, స్థైర్యం, బ్రాహ్మణుని క్షేమంకోరడం, ఇవన్నీ క్షత్రియస్వభావాలు

ఆస్తిక్యం, దానశీలత, దంభహీనత్వం, బ్రాహ్మణసేవ, ధనసంచయం వల్ల సంతోషం పొందకుండుట అనేవి వైశ్యస్వభావాలు కపటం లేకుండ బ్రాహ్మణులను, గోవులను, దేవతలను, సేవించడం దానివల్ల కలిగే ఆనందంతో తృప్తిచెందడం శూద్రలక్షణాలు.

అశౌచం, అసత్యం, చౌర్యం, నాస్తిక్యం, అనవసరకలహం, కామం, క్రోధం, విషయతృష్ణ పంచముల స్వభావాలు.

అహింస, సత్యం, దొంగతనం చేయకుండుట, కామం లేకుండుట, కోపం లేకుండుట, లోభం లేకుండుట, అన్ని ప్రాణులయందు ప్రీతి, అన్ని ప్రాణుల మేలుకోరుట ఇవి మానవులధర్మాలు.

ద్విజులు ఉపనయనం చేయించుకొని, గురుకులంలో వుండి జితేంద్రియులై వేదాధ్యయనం చేయాలి. జడలను, మేఖలను, అజినాన్ని,

దండాన్ని, అక్షమాలను, యజ్ఞోపవీతాన్ని, కమండలాన్ని, దర్భలను ధరించాలి. పండ్లు తోముకోకూడదు. బట్టల నుతకకూడదు. రంగువేసిన పీటపై కూర్చోకూడదు. స్నాన, భోజన, హోమ, జపాలను చేసేటప్పుడు, మలమూత్రాలను విడిచేటప్పుడు మౌనంగా వుండాలి. గోళ్ళను తీయకూడదు. కక్ష, ఉపస్థప్రదేశాలలో వెంట్రుకలు తీయకూడదు.

బ్రహ్మచారి వాంఛాపూర్వకంగా వీర్యం పోగొట్టుకోకూడదు. కలలో వీర్యం పోతే స్నానం చేయాలి. తర్వాత గాయత్రీమంత్రం జపించాలి. పవిత్రుడు, ఏకాగ్రచిత్తుడు, ముని అయిన బ్రహ్మచారి రెండుపూటలా సంధ్యోపాసనచేసి గాయత్రిని జపించాలి. అగ్నిని, సూర్యుని, ఆచార్యుని, ఆవుని, బ్రాహ్మణుని, గురువును, వృద్ధులను, దేవతలను పూజించాలి.

ఆచార్యుడు నా స్వరూపమే. ఆయనను అవమానించగూడదు. సర్వదేవతాస్వరూపుడు గురువు. ఆయనను సాధారణమనుష్యుడుగా అనుకొని దోషబుద్ధితో చూడకూడదు. రెండుపూటలా భిక్షాటనచేసి గురువుకి సమర్పించాలి. తర్వాత ఆయన ఆదేశంతో ఆ పదార్థాన్ని తీసుకోవాలి. గురుసేవకుడు ఆయనవెంట నీచునిలాగా పోవలెను. నిద్రాసమయంలో అప్రమత్తంగా ఆయనప్రక్కనే నిద్రించాలి. విశ్రాంతిసమయంలో ఆయనపాదాల నొత్తాలి. కూర్చుండినపుడు ఆయన ఆదేశంకోసం కొద్దిగా దూరంలో వుండి చేతులు కట్టుకొని కాచుకోవాలి. ఈవిధంగా గురువును అనుసరిస్తూ వుండాలి. వేదాధ్యయన సమయంలో భోగాలను త్యజించాలి. పై నియమాలు పాలిస్తూ గురుకులంలో అఖండబ్రహ్మచర్యం పాటించాలి. నైష్ఠికబ్రహ్మచారి మహర్లోకానికి, బ్రహ్మలోకానికి పోవాలనుకుంటే జీవితాంతం వేదాధ్యయనం చేస్తూ గురుశుశ్రూష చేయాలి. బ్రహ్మతేజస్సంపన్నుడు, పాపరహితుడు అయిన బ్రహ్మచారి అగ్నిలో, గురువులో, తనలో,

సర్వభూతాలలో భేదభావం లేకుండ నన్నుపాసించాలి. గృహస్థులు కానివారు ఆడవాళ్ళను చూడకూడదు. పరిహాసం చేయకూడదు. మైథునపరులైన ప్రాణులను చూడకూడదు.

శౌచం, ఆచమనం, స్నానం, సంధ్యోపాసనం, విష్ణుపూజ, తీర్థసేవనం, జపం, అస్పృశ్యులను తాకకుండవుండడం, తినరానివస్తువులను తినకుండవుండడం, మాట్లాడుటకు తగనివారితో మాట్లాడకుండవుండడం, అన్నిప్రాణులలో అంతర్యామిగా నేనున్నానని తెలిసికోవడం, మనోవాక్కాయాలను అదుపులో వుంచుకోవడం ఈ నియమాలన్నీ అన్ని ఆశ్రమాలవారికి సంబంధిస్తాయి.

ఈ విధంగా నైష్ఠికబ్రహ్మచారి అగ్నిలాగా ప్రకాశిస్తాడు. తీవ్రమైన తపస్సువల్ల అతని కర్మవాసనలన్నీ నాశనమౌతాయి. అందువల్ల నిష్కాముడై నాపై భక్తి గలవాడౌతాడు. తర్వాత పెళ్ళిచేసుకోవాలంటే వేదాధ్యయనం పూర్తిజేసి, గురువుకు దక్షిణ ఇచ్చి ఆయన అనుమతితో అభ్యంగనాదులు చేసి సమావర్తనం చేసుకోవాలి. కోరికలు కలవాడైతే ఆశ్రమక్రమాన్ని పాటించాలి. కోరికలు లేనివాడైతే నేరుగా సన్న్యాసాశ్రమాన్ని తీసుకోవచ్చు. గృహస్థుడు కావాలనుకొనేవాడు తనకు తగినది, తనకన్న వయస్సులో చిన్నది, అదే వర్ణానికి చెందినది అయిన కన్యను వివాహమాడాలి. కామాతురుడు ఇతరవర్ణాలవారిని వివాహమాడదలస్తే తనకన్న తక్కువ వర్ణం వారిని చేసుకోవాలి.

యజ్ఞయాగాదులు, అధ్యయనం, దానం చేసే అధికారం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణాలవాళ్లకు సమానంగావుంది. ప్రతిగ్రహణం, అధ్యయనం, యజనం ఈ మూడు బ్రాహ్మణధర్మాలు. దానం తీసుకొంటే తపస్సు, తేజస్సు, యశస్సు, నాశనమవుతాయనుకొంటే అధ్యాపనయాజనాలద్వారా జీవితాన్ని

గడుపుకోవాలి. అది దోషమనుకొంటే శిలావృత్తి (పరిగిఏరుకోవడం)ద్వారా జీవితాన్ని వెళ్ళబుచ్చాలి.

బ్రాహ్మణునిదేహం నీచాలైన కోరికలు తీర్చుకొనేందుకు కాదు. తీవ్రమైన తపస్సుకోసం, పరలోకసుఖంకోసం అని తెలుసుకో. శిలావృత్తిద్వారా ఉంఛవృత్తిద్వారా సంతుష్టుడై కోరికలు లేకుండ ఆతిథ్యాది ఉత్తమధర్మాలను ఆచరిస్తూ నాపై మనస్సు లగ్నంచేసి అధిక భోగపరాయణుడు కాని మానవుడు గృహస్థాశ్రమంలోనే మోక్షాన్ని పొందుతాడు.

కష్టాలలో వుండే నా భక్తుని ఎవరు కాపాడుతారో వారిని సముద్రంలో మునిగిపోయే మనుష్యుని కాపాడే పడవలాగా నేను ఉద్ధరిస్తాను. గజరాజు ఇతర ఏనుగులను, తనను కాపాడుకొనేవిధంగా ధీరుడైన రాజు తండ్రిలాగా కష్టాలనుండి జనులను, తనను కాపాడుకొంటాడు. ఇలాంటి రాజు ఈ లోకంలో అన్ని పాపాలనుండి విముక్తుడై సూర్యునిలాగా విమానాన్నెక్కి స్వర్గానికిపోయి ఇంద్రుడుతో కలిసి సుఖాలనుభవిస్తాడు.

బ్రాహ్మణుడు తనవృత్తివల్ల బ్రతకలేకపోతే వైశ్యవృత్తిద్వారా కష్టాలనుండి గట్టెక్కవచ్చు. అపుడు కూడ ఆపదలు వస్తే ఖడ్గాన్ని ధరించవచ్చు కాని నీచవృత్తి నవలంబించరాదు.

క్షత్రియుడు కష్టాలలో వుంటే వర్తకంద్వారా, వేటద్వారా, అధ్యాపనాదుల ద్వారా జీవితాన్ని గడపాలి. కాని హీనవృత్తి స్వీకరించకూడదు.

వైశ్యుడు ఆపత్కాలంలో శూద్రవృత్తిని, శూద్రుడు చాపలల్లే పనులను చేయాలి. కష్టాలనుండి బయటపడినాక దూష్యకర్మలతో జీవితాన్ని గడపకూడదు.

గృహస్థుడు ప్రతిరోజు ఋషులను, పితృదేవతలను, దేవతలను,

భూతాలను, మనుష్యులను క్రమంగా వేదాధ్యయనంతో, స్వధామంత్రాలతో స్వాహామంత్రాలతో, ఉపహారవస్తువులతో, అన్నోదకాదులతో ఆరాధించాలి. కష్టంలేకుండ దొరికినదానితో, వృత్తిద్వారా సంపాదించినదానితో సేవకులను, ఆశ్రితులను పాలిస్తూ శక్తిమేర యజ్ఞాలనాచరించాలి. గృహస్థునికి సంతానం అధికంగావున్నా భగవంతుని కూడా ధ్యానించాలి. తెలివైనవాడు స్వర్గసుఖాలను కూడ ఐహికభోగాల్లా భావించాలి. కొడుకులు, భార్య, ఆప్తులు, బంధువులు వీళ్ళ సమాగమం బాటసారులతో సమాగమంలాంటిది. కలలో కనిపించే పదార్థాలు నిద్ర అయిన తర్వాత కనపడవు. పుత్రాదుల సంబంధంకూడా శరీరమున్నంతవరకే తర్వాత వుండదు.

ఈ విధంగా ఆసక్తిలేనిభావంతో అతిథిలాగా ఇంటిలో వుండి మమకారాన్ని, అహంకారాన్ని వదలినవాడు గృహస్థధర్మానికి బద్ధుడు కాడు. భక్తుడైన పురుషుడు గృహస్థధర్మాలు పాటిస్తూ ఇంటిలో వుండవచ్చు. వనానికి పోవచ్చు. కుమారుడుంటే సన్యాసం తీసుకోవచ్చు. గృహమునందాసక్తుడు, పుత్రవిత్తాదిసంధానరతుడు, స్త్రీవశుడు, మూఢుడు, వివేకశూన్యుడు అహంకారమమకారాలవల్ల బద్ధుడౌతాడు.

ముసలివాళ్ళైన నా తల్లిదండ్రులు, చిన్నపిల్లలతో వుండే నా భార్యాబిడ్డలు నేను లేకపోతే అనాథలు, దీనులు ఔతారు. తర్వాత వీరెట్లా బ్రతుకుతారు? అని ఈ ప్రకారంగా ఆలోచించే తెలివితక్కువవాడు గృహస్థాశ్రమంలో బద్ధుడై మూర్ఖుడై వుంటాడు. తృప్తిలేనివాడై ఆత్మీయులను గురించి ఆలోచిస్తూ చనిపోయిన తర్వాత ఘోరనరకంలో పడతాడు.



## పదమూడవ అధ్యాయము

భగవంతుడు:– ఉద్ధవా! వానప్రస్థాశ్రమం స్వీకరించాలనుకునే వ్యక్తి భార్యను కొడుకుల దగ్గర వదలాలి లేదా తనతో తోడుతీసుకుని వెళ్ళాలి. ఈ విధంగా తనజీవితంలో మూడవభాగాన్ని ప్రశాంతంగా గడపాలి. అడవిలో పుట్టినవి, పవిత్రమైనవి అయిన కందమూల ఫలాల ద్వారా జీవితాన్ని గడుపుకోవాలి. జింక చర్మాన్నిగాని, నార చీరలుగాని, గడ్డినిగాని, ఆకులను గాని ధరించాలి. కేశపాశమును, రోమాలను, గోళ్ళను, మీసాలను శరీరం నుండి తీసెయ్యాలి. పళ్ళు తోమకూడదు. మూడుపూటలా స్నానం చేయాలి. భూమిపై పరుండాలి. ఎండాకాలంలో పంచాగ్నిమధ్యలో, వర్షాకాలంలో బహిరంగప్రదేశంలో, శీతాకాలంలో నీటిలో మెడవరకు వుండి తపస్సు చేయాలి. బాగా కాల్చిన కందమూలాలు లేక బాగా పండిన ఫలాలు భుజించాలి. ధాన్యాన్ని రోలులోగాని, రాతి మీదగాని దంచాలి. పండ్లతో నమలాలి. దేశకాలబలాలను తెలిసికొని ఆప్రకారం తన జీవితాని కుపయోగపడే అన్ని వస్తువులను సొంతంగా సంపాదించుకోవాలి. ఎప్పుడో కూడబెట్టుకున్నవాటిని ఇతర సమయాలలో తీసుకోకూడదు. వానప్రస్థులు అడవిలో పండే నీవారాది ధాన్యాలతో తయారైన చరుపురోడాశాదులతో కాలోక్తాలైన ధర్మాలనాచరించాలి. కాని శ్రుతి విహితమైన పశుమాంసంతో నన్నారాధించకూడదు. వానప్రస్థుడు గృహస్థునిలాగా అగ్నిహోత్రాన్ని, దర్శపౌర్ణమాసాలను, చాతుర్మాస్యాలను ఆచరించాలని వేదపండితులు నిర్ణయించారు. ఈ విధంగా జీవితాంతం తపస్సు చేయడంవలన ముని ఎండిపోయిన శరీరం కలవాడౌతాడు. అతనిలోని నరాలు బయటపడతాయి. తపోమయుడనైన నన్నారాధించి ఋషిలోకాలకు పోతాడు. తర్వాత నన్నుపొంది ముక్తుడౌతాడు. మోక్షాన్ని కలిగించేది, మహాకష్టసంచితము

అయిన ఉత్తమ తపస్సును స్వర్గాది తుచ్ఛ ఫలాలకోసం వినియోగిస్తే మూర్ఖత్వమౌతుంది. కాబట్టి నిష్కామంతో తపస్సు చేయాలి. వానప్రస్థుడు తన ఆశ్రమానికి తగిన నియమాలు పాటించలేనప్పుడు, వృద్ధాప్యం వల్ల శరీరం సహకరించనప్పుడు యజ్ఞాగ్నులను మనస్సులో ఊహించుకొని నాపై మనస్సు నిలిపి అగ్నిలో ప్రవేశించాలి. కర్మఫలంగా వచ్చేవి దుః ఖమయాలు అయిన లోకాలన్నింటిలో పూర్తివైరాగ్యం కలిగితే, యజ్ఞాగ్నులను వదలి సన్న్యాసం తీసుకోవాలి. యథావిధిగా యజ్ఞాలద్వారా నన్నారాధించి, ఋత్విక్కులకు మొత్తం దానం చేసి అగ్నులను తనలో ఆరోపించుకొని అపేక్షలేని మనస్సుతో సన్న్యాసం తీసుకోవాలి. సన్న్యాసం తీసుకోబోయే మానవుడు మమ్ములను కాదని పరబ్రహ్మాన్ని పొందగోరుతున్నాడని భావించి దేవతలు భార్యలరూపంతో సన్న్యాసం తీసుకోబోయే బ్రాహ్మణునికి ఆటంకాలు కలిగిస్తారు.

సన్న్యాసి గోచి పెట్టుకోవాలి. వస్త్రాన్ని ధరించాలనుకుంటె గోచి కనపడకుండ ఒక వస్త్రాన్ని చుట్టుకోవాలి. ఆయాశ్రమానికి సంబంధించిన దండకమండలాలు మాత్రమే ధరించాలి. ఆపత్సమయంలో ఈ నియమాలు వర్తించవు. సన్న్యాసి పవిత్రస్థలంలో అడుగుపెట్టాలి. గుడ్డతో వడగట్టి నీటిని త్రాగాలి. సత్యమునే పలకాలి. మనస్సు పవిత్రమని భావించిన మంచిపనినే చేయాలి. వాక్కుకు మౌనం, శరీరానికి త్యాగం, మనస్సుకు ప్రాణాయామం దండాలు. ఈ మూడు దండాలు లేనివాడు వేణుదండాన్ని ధరించినా సన్న్యాసి కాలేడు. నాలుగు వర్ణాలవారిలో శాపానికి గురయినవారు, పతితులు మొదలైన వాళ్ళను వదలి ఏవైనా ఏడు ఇండ్లకుపోయి భిక్షను తీసుకోవాలి. దొరికిన దానితో తృప్తిపడాలి. చెరువులో స్నానం చేయాలి. భిక్షాన్నాన్ని ప్రోక్షణ చేయాలి. పద్ధతిగా భుజించాలి సన్న్యాసి నిస్సంగుడు,

సంయతేంద్రియుడు, ఆత్మక్రీడాశీలుడు, ఆత్మరతుడై ఒంటరిగా భూమిపై తిరగాలి. ముని జనంలేని, భయంలేని ప్రదేశాలలో శుద్ధ మనస్కుడై వుండాలి. నాకన్నా వేరుగాని ఆత్మతత్త్వాన్నే ధ్యానించాలి. ముని జ్ఞాననిష్ఠద్వారా బంధమోక్షాలగురించి ఆలోచించాలి. ఇంద్రియ చాంచల్యమే బంధము. వాటిని నిగ్రహించుటే మోక్షము. కాబట్టి సన్న్యాసి షడ్వర్గాలను విషయసుఖాలను వదలి చిదానందాన్ననుభవిస్తూ నాపైధ్యాసతో తిరగాలి. పుణ్యదేశాలు, నదులు, పర్వతాలు, వర్ణాశ్రమాలు కలిగిన భూమిపై తిరుగుతూ భిక్షకోసం నగరాలకు, గ్రామాలకు, గోవులుండే చోటుకి, యాత్రికుల దగ్గరకు వెళ్ళాలి. వానప్రస్థాశ్రమంనుండే అధికంగా భిక్షను తీసుకోవాలి. శిలావృత్తిద్వారా దొరికిన దానితో భుజిస్తే చిత్తం శుద్ధమౌతుంది. మోహరహితమవుతుంది. మోక్షం కూడా తొందరగా లభిస్తుంది. కనిపించేటివన్ని అశాశ్వతాలు. కాబట్టి వాటియందాసక్తుడు కాకూడదు. ఐహికాముష్మిక విషయాలలో ఆసక్తిలేనివాడై కోరికలనుండి విరక్తుడు కావాలి. ఈ జగత్తు, శరీరం, సుఖదుఃఖాలు స్వప్నతుల్యాలని భావించి ఆత్మనిష్ఠుడై మళ్ళీవాటిని గురించి ఆలోచించకూడదు. బాహ్యవిషయాలలో విరక్తుడై జ్ఞాననిష్ఠుడు కావాలి. లేదా నాపై భక్తి కలిగివుండాలి. ఇలాంటివాడు దండాదిచిహ్నాలతో విధి నిషేధాలకతీతంగా ధర్మాన్నాచరించాలి. అతడు తెలివైనవాడైనా చిన్నపిల్లవానిలా ఆడుకుంటాడు. నిపుణుడైనా జడునిలాగా వ్యవహరిస్తాడు. పండితుడైనా ఉన్మాదిలా మాట్లాడతాడు. వేదార్థనిష్ఠుడై కూడా నియమం లేకుండా మెలగుతాడు. సన్న్యాసి కర్మకాండ వ్యాఖ్యానాది నిష్ఠుడు, పాషండుడు, కేవలతర్కరతుడు కాకూడదు. అనవసరవాదం చేయకూడదు. ఏ పక్షాన్ని అవలంబించకూడదు. సన్న్యాసి ధీరుడుగా వుండాలి. ఎవ్వరికి భయపడకూడదు. ఎవ్వరిని భయపెట్టకూడదు. అతన్నెవరు దుర్భాషలాడినా సంతోషంగా సహించాలి. ఎవ్వరిని

అవమానించకూడదు. అతడీశరీరం కోసం ఎవ్వరితోను విరోధం పెట్టుకోకూడదు. ఇలాంటివైరం పశువ్యవహారం. ఒకే చంద్రుడు నీటిలో అనేకరూపాలుగా ప్రతిబింబిస్తాడు. అదే విధంగా ఒకే పరమాత్మ భిన్నదేహాలలో ఆత్మలో అంతర్యామిరూపంగా అనేకరూపాలుగా వున్నాడు. ఈ దేహాలన్ని ఒకే ఆత్మతో కూడినవి. సన్న్యాసి అన్నం దొరికితే సంతోషించడం, దొరక్కపోతే దుఃఖించడం చేయకూడదు. ఆహారం దొరికినా దొరక్కపోయినా దైవాధీనమే అని తెలుసుకోవాలి. ప్రాణరక్షణకోసం ఆహారం తప్పక సంపాదించుకోవాలి. ప్రాణముంటె తత్త్వవిచారం చేసి ముక్తి పొందవచ్చు. అదృష్టవశాత్తు దొరికిన ఆహార, వస్త్ర, శయ్యాదులు మంచివి అయినా కాకపోయినా వాటిని తీసుకోవలసిందే.

నేను ఈశ్వరుడనై వుండికూడ నియమాలకతీతంగా కర్మలు చేస్తాను. అట్లే జ్ఞాని కూడ విధినిషేధాలకతీతంగా శౌచాచమనాది కర్మలనాచరించాలి. అపుడు జ్ఞానికి భేదజ్ఞానం వుండదు. భేదజ్ఞానం వున్నా నాసాక్షాత్కారంతో నశిస్తుంది. కాబట్టి మరణపర్యంతం బాధకు గురి అయిన భేదం ప్రతీతమవుతుంది. దేహావసానంలో నాతో సమానమైన సార్ష్టి అనే సంపద లభిస్తుంది. జితేంద్రియుడు విషయాలవల్ల కలిగేది దుఃఖమేనని తెలిసికొని విరక్తి చెందుతాడు. కాని నన్నే పొందే సాధనాల గురించి తెలుసుకోలేడు. అపుడతను పరబ్రహ్మనిష్ఠుడైన గురువునాశ్రయించాలి. శ్రద్ధకలవాడు, అసూయలేనివాడు, భక్తి గలవాడు అయి బ్రహ్మజ్ఞానం కలిగేవరకు ఆదరంతో నా స్వరూపంగా భావించి గురువునాశ్రయించాలి. జ్ఞానవైరాగ్యాలు లేనివాడు, కామాది షడ్వర్గాలు గెలువనివాడు, ఇంద్రియాలకు సారథియైన బుద్ధిచే చలించేవాడు, పొట్టకూటికోసం సన్న్యాసం తీసుకున్నవాడు, అపరిణత విషయ వాసనాగ్రస్తుడు, ధర్మనాశకుడు అయిన పురుషుడు దేవతలను,

తన ఆత్మను, ఆత్మ స్థితుడనైన నన్ను వంచిస్తాడు. చివరికి తానుకూడా ఉభయభ్రష్టుడవుతాడు.

సన్న్యాసి ధర్మం శమం అహింస, వానప్రస్థుని ధర్మం తపస్సు ఆత్మానాత్మవివేకజ్ఞానం, గృహస్థుని ధర్మం భూతరక్షయజ్ఞం, బ్రహ్మచారి ధర్మం గురుసేవ. గృహస్థుడు కూడా ఋతుకాలంలోనే భార్యను కలవాలి. బ్రహ్మచర్యం, తపస్సు, శౌచం, సంతోషం, భూతదయ అనేవి గృహస్థుని ప్రధాన ధర్మాలు. అందరూ నన్నుపాసించాల్సిందే. ఈ విధంగా అనన్యభావంతో తన వర్ణాశ్రమ ధర్మాన్ననుసరించి నా సేవ చేసేవాడు, అన్ని ప్రాణులలో నేనే అంతర్యామిరూపంతో వున్నానని తలంచేవాడు నాపై దృఢభక్తి కలవాడవుతాడు. గృహస్థుడు నిరంతరభక్తితో సృష్టిస్థితి సంహారకారకుడను, సర్వలోకేశ్వరుడను, జగత్కారకుడను, బ్రహ్మరూపుడను అయిన నన్ను పొందుతాడు.

ఈ విధంగా జీవుడు స్వధర్మాన్ని పాలిస్తూ అంతఃకరణశుద్ధి చేసుకోవాలి. నా ఐశ్వర్యాన్ని తెలిసికొని, జ్ఞానవిజ్ఞాన సంపన్నుడై త్వరలోనే నన్ను పొందుతాడు. నేను నీకీవర్ణాశ్రమాలవారవలంబించే ధర్మాన్ని, ఆచారాలను, లక్షణాలను వివరించాను. నాపై భక్తి కలిగి వుంటె ఈ ధర్మం పరమముక్తిని ప్రసాదిస్తుంది. ఉద్ధవా! నీవు నన్నడిగినదానికి తగినట్లుగ స్వధర్మాన్ని పాలిస్తూ భక్తుడు పరమాత్మరూపుడనైన నన్నెట్లు పొందుతాడో నీకు వివరించాను.



## పదునాల్గవ అధ్యాయము

భగవంతుడు:- శాస్త్రజ్ఞాన సంపన్నుడు, ఆత్మతత్త్వజ్ఞుడు, పరోక్షజ్ఞానం లేనివాడు అయిన మానవుడు ఈ ప్రపంచాన్ని మాయగా తలచి త్యజించాలి. జ్ఞానులకభీష్టఫలాన్ని, తత్సాధనాన్ని, స్వర్గాపవర్గాలు నేనే. కాబట్టి నన్ను తప్ప ఇంకే పదార్థాన్ని గృహస్థుడు కోరడు. జ్ఞానవిజ్ఞానాలతో కూడినవారు నా పాదాలనే శ్రేష్ఠాలుగా భావిస్తారు. జ్ఞాని తన జ్ఞానంతో నన్ను సుఖింపచేస్తాడు. ఇటువంటివాడే నాకు చాలా ఇష్టమైనవాడు. తత్త్వజ్ఞానంవల్ల కలిగే సిద్ధి తపస్తీర్థ జపదానాలచేతగాని, ఇంకే ఇతరపుణ్య కర్మలచేతగాని కలుగదు. ఉద్ధవా! నీవు జ్ఞానంతో నీ ఆత్మవస్తువును తెలుసుకో. జ్ఞానవిజ్ఞాన సంపన్నుడవై భక్తిభావంతో నన్నారాధించు.

పూర్వకాలంలో మునులు జ్ఞానవిజ్ఞాన యజ్ఞం ద్వారా ఆత్మయందు నన్ను పూజించి నాస్వరూపసంసిద్ధిని పొందారు. నిన్నాశ్రయించివున్న ఆధ్యాత్మికాది మూడు వికారాలను మాయామాత్రాలని తెలుసుకో. రజ్జుసర్పన్యాయంలాగా అవి ఆదిమధ్యావసానాలలోనే కనపడుతున్నాయి. జన్మాది వికారం ధర్మం కలిగింది శరీరానికే కాని ఆత్మకు కాదు. అందువల్ల వానికధిష్ఠాన స్వరూపుడవైన నీకెటువంటి నాశంలేదు. లేనిపాము ఎపుడూలేనిదే వున్న త్రాడు ఎపుడూ వుండునదే. కాబట్టి వికారసమూహానికి కూడా నిజానికి ఎటువంటి ఉనికిలేదు.

ఉద్ధవుడు:- విశ్వేశ్వరా! విశాలం, పురాతనం వైరాగ్య విజ్ఞాన యుతమైన నీవిశుద్ధజ్ఞానాన్ని, భక్తియోగాన్ని వివరించు. ఘోరసంసారంలో తాపత్రయాభిభూతులం, సంతాపగ్రస్తులం అయిన మాలాంటివాళ్ళకు అమృతాన్ని వర్షించే నీ పాదపద్మ ఛత్రమే ఆశ్రయము. మహానుభావా!

సంసారకూపంలో వున్నట్టి, కాలసర్పంచే కరవబడినట్టి, క్షుద్రవిషయాలతో కూడినట్టి నాలాంటి జీవులను ఉద్ధరించి మోక్షబోధకాలైన నీవాగమృత ధారలను వర్షించు.

భగవంతుడు:- ఉద్ధవా! పురాతనకాలంలో ధర్మరాజు భీష్ముని మేమందరం వింటుండగానే ఇట్లడిగాడు. కురుక్షేత్రయుద్ధానంతరం యుధిష్ఠిరుడు బంధువులు చనిపోయిన విషాదంలో వుండగా భీష్ముడు చెప్పిన ఎన్నో ధర్మాలను విన్నాడు. తర్వాత మోక్షధర్మాన్ని గురించి కూడా అడిగాడు. నేను భీష్ముని నుండి వినిన మోక్షధర్మాలు నీకు వివరిస్తాను. అవి జ్ఞాన విజ్ఞానాలతో, వైరాగ్యంతో, శ్రద్ధాభక్తులతో కూడుకున్నవి. బ్రహ్మాది స్థావరం వరకుగల కార్యసమూహంలో ప్రకృతి, పురుషులు, మహత్తత్త్వం, అహంకారం, పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియాలు, పంచమహాభూతాలు, గుణత్రయము అనే ఈ ఇరవైఎనిమిది తత్త్వాలను చూపించేది, వీటిలో కూడ పరమాత్మ తత్త్వాన్ని అనుగతరూపంగా చూపించేది అయిన జ్ఞానమే నాకు సమ్మతమని తెలుసుకో. ఎపుడు మనం చూచిన పదార్థాలు భిన్నభిన్నమైనవి కనిపించకుండా పోతాయో, వాటికన్నింటికి మూలమైన బ్రహ్మమొక్కటే గోచరిస్తుందో ఆ అనుభవాన్నే విజ్ఞానమంటారు. అవయవాలతో కూడిన భౌతిక పదార్థాలే సృష్టిస్థితిలయ ధర్మయుక్తాలని తెలుసుకో. సృష్టిప్రళయాలలో కారణరూపంతో, స్థితికాలంలో ఆశ్రయరూపంతో ఒకపనినుండి ఇంకొకపనికి ఎల్లపుడు వదలకుండా వచ్చేవస్తువు ప్రళయాంతంలో మిగిలివుంటుంది. అలాంటి వస్తువు సత్తని తెలుసుకో. శ్రుతి, ప్రత్యక్షం, ఐతిహ్యం, అనుమానం అనే ఈ నాలుగు ప్రమాణములచే భేదం బాధితమవడం వల్ల పురుషుడు దానినుండి విరక్తుడవుతాడు. తెలివైనవాడు స్వర్గసుఖాలు కూడ మనకు కనిపించే ప్రత్యక్షవిషయాలలాగా అమంగళాలు,

నశ్వరాలని తెలుసుకోవాలి. అనఘా! నీవు నాకు ప్రియమైనవాడివి కాబట్టి ముందే నీకు భక్తియోగం గురించి చెప్పాను. మళ్ళీ ఇపుడు నా భక్తిని పొందే ప్రధానసాధనాలను వర్ణిస్తాను.

భక్తుడు నా కథలలో శ్రద్ధనుంచాలి నా నామ సంకీర్తన చేయాలి. నా పూజా సమయంలో నిష్ఠగా వుండాలి. స్తోత్రాలతో నన్ను స్తుతించాలి. నా సేవలో ప్రేమ చూపాలి. సాష్టాంగ నమస్కారం చేయాలి. నా భక్తులను బాగా పూజించాలి. ప్రాణులన్నింటిలో నన్నే చూడాలి. చేసే పనులన్నీ నన్నుద్దేశించే చేయాలి. వాక్కుతో నాగుణాలను కీర్తించాలి. మనస్సు నాకర్పించాలి. అన్ని కోరికలను వదలాలి. నా కోసం డబ్బుని, భోగాన్ని, సుఖాన్ని వదలాలి. యజ్ఞం, దానం, హోమం, జపం, వ్రతం, తపస్సు అన్నీ నాకొరకే ఆచరించాలి.

ఈ ధర్మాలుపాలించేవాడు, ఆత్మనివేదన చేసేవాడు అయిన మానవుని హృదయంలో భక్తి పుడుతుంది. అటువంటి వానికి ఇక దొరకాల్సింది ఏదీ వుండదు. సాత్త్వికం, శాంతం అయిన మనస్సును నా కర్పించినపుడే మానవుడు ధర్మజ్ఞానవైరాగ్యసహితమైన ఐశ్వర్యాన్ని పొందుతాడు. దేహం, గృహం ఈ విషయాలలో ఇంద్రియాలతో పరుగెత్తే మనస్సు రజోగుణసహితమై వుంటుంది. కాబట్టి అది అధర్మానికి, అజ్ఞానానికి, మోహానికి నిలయమవుతుంది. నాపై భక్తి కలగడమే ధర్మం. సర్వత్ర పరమాత్మని దర్శించుటే జ్ఞానం. విషయాలలో ఆసక్తి లేకపోవడమే వైరాగ్యం అష్టసిద్ధులే ఐశ్వర్యం.

ఉద్ధవుడు:- యమనియమాలెన్ని? శమమంటె ఏమిటి? దమమంటె ఏమిటి? తితిక్ష, ధృతి అంటే ఏమిటి? దానం, తపస్సు, శౌర్యం, సత్యం,

ఋతం, త్యాగం, ఇష్టం, ధనం, యజ్ఞం, దక్షిణ అంటే ఏమిటి? పురుషుని బలం ఎటువంటిది? దయ అంటె ఏమిటి? లాభమంటె ఏమిటి? విద్య, లజ్జ, శ్రీ, సుఖదుఃఖాలంటే ఏవి? పండితుని లక్షణాలేవి? మూర్ఖుడంటె ఎటువంటివాడు? సన్మార్గలక్షణాలేవి? దుఃర్మార్గలక్షణాలేవి? స్వర్గనరకాలెటువంటివి? బంధువులంటె ఎటువంటివారు? ఇల్లు అంటె ఏమిటి? డబ్బున్నవాడు ఎవరు? డబ్బులేనివాడు ఎవరు? కృపణుడంటె ఎవరు? ఈశ్వరుడెవరు? నా ప్రశ్నలకు సమాధానం చెప్పు. వీటితోపాటు వ్యతిరేకభావాలగురించి కూడా విశదీకరించు.

భగవంతుడు:- ఉద్ధవా! అహింస, సత్యం, దొంగిలించకుండ వుండడం, అసంగం, లజ్జ, కూడబెట్టకుండావుండడం, ఆస్తిక్యం, బ్రహ్మచర్యం, మౌనం, స్థైర్యం, క్షమ, అభయం అనేవి పండ్రెండు యమాలు. బాహ్యశౌచం, అభ్యంతరశౌచం, జపం, తపం, హోమం, శ్రద్ధ, ఆతిథ్యం, నా పూజ, తీర్థాటనం, పరహిత చేష్ట, సంతుష్టి, గురుసేవ అనే ఈ పండ్రెండు నియమాలు. వీటిని అనుష్ఠించడం వల్ల ఉపాసకులు భోగమోక్షాలు, అభ్యుదయం పొందుతారు.

బుద్ధిని నాపై లగ్నం చేయడమే శమం, ఇంద్రియాలను నిగ్రహించడమే దమం. దుఃఖాలను సహించడమే తితిక్ష. నాలుకను, జననేంద్రియాన్ని జయించడమే ధైర్యం. ఎవ్వరికి ద్రోహం చేయకుండడం దానం కోరికలను త్యాగం చేయడం తపస్సు. వాసనలను నిరోధించడం శౌర్యం. సమదర్శనమే సత్యం, సత్యం ప్రియం అయిన వాక్కునే మహాత్ములు ఋతమని చెప్పారు. పనులలో ఆసక్తిలేకపోవడం శౌచం. కోరికలను వదలడమే సన్న్యాసం. ధర్మాన్ని కలిగివుండడమే ధనం, భగవంతుడే యజ్ఞం. జ్ఞానాన్ని బోధించడమే దక్షిణ. ప్రాణాయామమే శ్రేష్ఠమైన బలం. నా ఐశ్వర్యమే భగం. నాపై

ఉత్తమ భక్తే లాభం. ఆత్మలో కలిగే భేదాన్ని తొలగించేదే విద్య. చేయకూడని పనులలో జుగుప్సను కలిగించేదే లజ్జ. అపేక్ష లేని గుణమే 'శ్రీ' సుఖదుః ఖాలనతిక్రమించేదే సుఖం. విషయసుఖాలు కోరేదే దుఃఖము. బంధమోక్షాలతత్త్వాన్ని తెలిసినవాడే పండితుడు. ఈ శరీరం నాది అనే బుద్ధి గలవాడే మూర్ఖుడు. ఈ ప్రపంచంనుండి మరలడమే సన్మార్గం. ప్రవృత్తిమార్గాన్నవలంబించడమే దుర్మార్గం. సత్త్వగుణాభివృద్ధే స్వర్గం. తమోగుణాభివృద్ధే నరకం. నేనే బంధువును. మానవ శరీరమే ఇల్లు. గుణవంతుడే ధనవంతుడు. సంతోషం లేనివాడే దరిద్రుడు. ఇంద్రియాలను జయించనివాడే కృపణుడు. విషయాలలో ఆసక్తి లేనివాడే స్వతంత్రుడు. విషయాలలో ఎక్కువ ఆసక్తి గలవాడే అస్వతంత్రుడు.

ఉద్ధవా! నీవడిగిన ప్రశ్నలన్నింటికి సమాధానం చెప్పాను. గుణదోషాల లక్షణాలను ఎన్నని వర్ణించగలను? గుణదోషాలగురించి ఆలోచించడమే దోషమని, వాటిరెంటిని గురించి ఆలోచించకుండా వుండడమే గుణమని తెలుసుకో.



## పదిహేనవ అధ్యాయము

ఉద్ధవుడు:- అరవిందాక్షా ! సకల శక్తి మంతుడవైన నీ ఆదేశాలే విధినిషేధరూపాలైన వేదాలు. ఇవి కర్మల గుణదోషాలను ప్రతిపాదిస్తున్నాయి. ఆవేదాలే వర్ణాశ్రమ భేదాలను, ప్రతిలోమజానులోమజాలైన మంచి చెడులను, ద్రవ్యదేశవయః కాలాలను, స్వర్గనరకాలను వివరిస్తాయి. గుణదోషదృష్టి లేకుండ విధినిషేధాత్మకమైన వాక్కు వుండదు. విధినిషేధ వాక్కులేకుండ మానవులకు ముక్తి కలగదు.మోక్షాన్ని, స్వర్గాదివిషయాలను, సాధ్యసాధనజ్ఞానాన్ని వెల్లడిచేసే నీ వాక్కే వేదము. అది పితృదేవతలకు, మనుష్యులకు ప్రమాణంగా వుంది. నీ వాక్కయిన వేదంనుండి గుణదోషాలకు భేదదృష్టి ప్రవర్తితమైంది. అది స్వతస్సిద్ధం కాదు. వేదం భేదాన్ని కూడా తొలగిస్తుంది. అనే వాక్యశ్రవణమున నాకు సంశయం కలుగుతున్నది. కాబట్టి దానిని తొలగించు.

భగవంతుడు:- ఉద్ధవా! మానవులకు మేలు చేయాలని జ్ఞానం, కర్మ, భక్తి అనే మూడుయోగాలను నిర్దేశించాను. ఇంతకుమించిన ఉపాయం లేదు, వీటిలో కర్మలనుండి కర్మఫలాలనుండి విరక్తి చెందిన వారు జ్ఞానయోగులు. కర్మలనుండి విరక్తి చెందనివారు కర్మయోగులు. నా కథలలో శ్రద్ధ కలిగినవాడు, విషయాలలో వైరాగ్యం లేదా అమితాసక్తి లేనివాడు అయిన పురుషునకు భక్తి యోగం సిద్ధి కలిగిస్తుంది. కర్మ విషయాలలో దుఃఖజ్ఞానం, నా కథాశ్రవణంలో శ్రద్ధ కలుగనంత వరకు మానవుడు కర్మలు చేస్తూండాలి. తన ధర్మాన్నాచరించేవాడు, ఫలకాంక్ష లేని వాడు అయిన పురుషుడు యజ్ఞం ద్వారా దేవతలనారాధించి నిషిద్ధకర్మలను, కామ్యకర్మలను ఆచరించకపోతే వాడికి స్వర్గంగాని నరకం గాని ప్రాప్తించదు.

స్వధర్మ పరాయణుడు, నిషేధకర్మత్యాగి, శుద్ధుడు అయిన పురుషుడు ఈ లోకంలో వున్నా జ్ఞానం ద్వారా లేదా అదృష్టంద్వారా నాభక్తిని పొందుతాడు. స్వర్గంలో వున్నవారు కూడా జ్ఞానాన్ని, భక్తిని సాధించుట కయోగ్యులగుట వలన జ్ఞాన, భక్తి సాధకమైన మనుష్యజన్మనే ఎప్పుడు కోరుకుంటారు. దేహాభిమానం హాని కలిగిస్తుంది. కాబట్టి గుణవంతుడు స్వర్గనరకాలనుగాని, మానవజన్మను కాని కోరుకోడు.

ఈ శరీరం నశించే స్వభావం కలది. ఇది తెలుసుకొని జాగరూకతతో మృత్యువుకు ముందే ముక్తికి యత్నించాలి. పక్షి తాను నివసించే చెట్టును వదలిలేచిపోతుంది. పగలు, రాత్రి ఆయుస్సును తగ్గిస్తాయని తెలుసుకున్న మానవుడు భయకంపితుడవుతాడు. ముక్తసంగుడై పరబ్రహ్మాన్ని తెలుసుకుంటాడు. కోరికలేనివాడై శాంతిని పొందుతాడు.

ఈ మానవజీవితం సులభమైనది. దుర్లభమైనది. గట్టిది సంసారసాగరాన్ని దాటడానికి మంచినౌక. శరణుకోరితే గురువు కర్ణధారుడై దీనిని నడిపిస్తాడు. స్మరించినంతనే నేను ఈ శరీరాన్ని లక్ష్యంవైపు తీసుకుపోతాను. ఇంతమంచి అవకాశంవున్నా ఈ శరీరం ద్వారా సంసారసాగరాన్ని దాటలేని మానవుడు తనకు తానే పతనమవుతాడని అర్థం. దుఃఖాన్నిచూచి ప్రారంభించిన పనులలో ఉద్వేగం చెంది ఫలాపేక్ష లేనివాడైన యోగి జితేంద్రియుడై, ఆత్మవిషయకమగు వృత్తిప్రవాహాన్ననుసరించి నిశ్చలభావంతో మనస్సును నియమిస్తాడు. బలవంతగా మనస్సును నిగ్రహించినా చంచలస్వభావంతో లక్ష్యమునందు నిలవదు. అపుడు సావధానుడై అనుకూల మార్గం ద్వారా దానిని స్వాధీనం చేసుకోవాలి.

జితేంద్రియుడు జితప్రాణుడై సత్త్వసంపన్నమైన బుద్ధి ద్వారా మనస్సును ఆత్మవశం చేసుకోవాలి. అంతేగాని దానిని అశ్రద్ధ చేయకూడదు.

రౌతు తన మనోభిప్రాయం ప్రకారం గుర్రానికి శిక్షణ యిచ్చి స్వాధీనం చేసుకుంటాడు. అట్లే అనువృత్తి మార్గం ద్వారా మనస్సును వశం చేసుకోవటమే ఉత్తమయోగం. మనస్సు చలనరహితమైన స్థితిని పొందేవరకు మానవుడు తత్త్వజ్ఞానం ద్వారా సమస్తవస్తువుల అనులోమ ప్రతిలోమ క్రమాన్ని గూర్చి ఆలోచించాలి. నిర్వేదానికి గురైనవాడు, వైరాగ్యం కలవాడు అయిన పురుషుడు గురూపదేశాలగురించి ఆలోచించి ఆలోచించి దేహాభిమానం త్యజిస్తాడు. యమాది యోగమార్గాలచేత, ఆన్వీక్షికీ విద్యచేత, నా శిలను పూజించుటచేత మనస్సు పరమాత్మను చేరుతుంది. ఇతర ఉపాయాలచేత కాదు.

యోగి అనుకోకుండ ఏదైనా చేయకూడనిది చేస్తే దానివల్ల కలిగే పాపాన్ని యోగం ద్వారా పోగొట్టుకోవాలి. అంతేకాని ఇతర వుపాయాల ద్వారా ప్రాయశ్చిత్తం చేసుకోకూడదు. తన అధికారవిషయాలలో వుండే ఏకాగ్రతనే గుణమంటారు. ఈ గుణదోషం వల్ల కలిగే సాంగత్యాన్ని తొలగించాలి. ఎందుకంటె కర్మలు అశుద్ధాలు. కాబట్టి వీలున్నంతవరకు ప్రవృత్తిని తగ్గించుకోవాలి. నాకథలలో శ్రద్ధకలవాడు, కర్మలలో నిర్విణ్ణుడు అయిన పురుషుడు విషయాలు దుఃఖాత్మకాలని తెలుసుకోవాలి. విషయాలు విడుచుట కష్టమైతే వాటిని అనుభవిస్తూనే వాటియందు ఇష్టంలేనివాడై నాపై భక్తితో దృఢనిశ్చయం తో ప్రీతితో నన్నారాధించాలి.

ముందు చెప్పినట్లు నాపై భక్తి కలిగి నన్నారాధించేవాని హృదయంలో నేనెప్పుడూ వుంటాను. అందువల్ల అతని హృదయంలో వుండే విషయవాసనలన్నీపోతాయి. సర్వాంతర్యామిని అయిన నన్ను సాక్షాత్కారం చేసుకున్న మానవుని అహంకారం పోతుంది. సంశయాలు పోతాయి. కర్మలు నశిస్తాయి. కాబట్టి నాభక్తియుక్తుడు, నాపై చిత్తం నిలిపినవాడు అయిన

యోగికి జ్ఞానంగాని, వైరాగ్యంగాని, శ్రేయస్సునుగాని కలిగించలేవు. కర్మ, తపస్సు, జ్ఞానం, వైరాగ్యం, యోగం, దానం, ధర్మం, తీర్థయాత్రలు, వ్రతాలు లాంటి సాధనాల ద్వారాపొందే దానిని నా భక్తుడు భక్తియోగం ద్వారా సులభంగా పొందుతాడు. వాడికెటువంటి కోరిక వుండదు. ఒకవేళ అతను కోరితే స్వర్గమైనా, మోక్షమైనా లేదా వైకుంఠమైనా దొరుకుతుంది.

నాపై ప్రీతికలవారు, ధైర్యవంతులు, సాధువులు అయిన భక్తులు నేనిచ్చే ఆత్యంతికమోక్షాన్ని కూడా స్వీకరించరు. అపేక్షలేకుండటమే సర్వోత్కృష్టం. అదే అధికమైన నిఃశ్రేయసమని పిలువబడుతున్నది. కాబట్టి నిరపేక్షుడు నిష్కాముడు అయిన వ్యక్తి తప్పకుండా నాభక్తిని పొందుతాడు. అనురాగం లేనివారు, సమదర్శనులు నాపై భక్తిగలవారు, మాయాతీతమయిన భగవద్వస్తువును పొందిన వారు అయిన భక్తులకు విధినిషేధాలతో కూడిన పుణ్యపాపాలకు ఏ సంబంధం వుండదు. నేను చెప్పిన ఈ కర్మభక్తి జ్ఞాన మార్గాలు ఎవరాశ్రయిస్తే వాళ్ళు వైకుంఠాన్ని పొందగలరు. వాళ్ళే బ్రహ్మజ్ఞానులు.

## పదహారవ అధ్యాయము

భగవంతుడు :- నేను చెప్పిన ఈ భక్తి జ్ఞానక్రియాత్మకమైన మార్గాలను వదలి చంచలములైన ఇంద్రియాలతో నీచాలైన విషయసుఖాలనుభవించేవారు అన్ని పాపాలకు నిలయాలైన యోనులలో తిరుగుతారు. వాళ్ళవాళ్ళ అధికారంలో వుండడం గుణం. ఇతరుల అధికారంలో వుండడం దోషం. ఇదే గుణదోషస్వరూపం. అనఘా! ఇది యోగ్యమా! కాదా! అనే సందేహంతో ద్రవ్యంయొక్క స్వభావప్రవృత్తిని నిరోధించడానికి సమానవస్తువులలో కూడా ధర్మంకోసం శుద్ధి, అశుద్ధి వ్యవహారార్థం

గుణదోషాలు, దేహరక్షణార్థమై శుభాశుభాలు విధింపబడుతున్నాయి. ధర్మభారాన్ని మోసే మానవులకు మన్వాదుల రూపం ధరించి నే నీ ఆచారాన్ని చూపించాను. పంచభూతాలు బ్రహ్మనుండి స్థావరపర్యంతం అన్నిప్రాణాలకు కారణాలై వున్నాయి. అన్నిప్రాణుల దేహాలు సమానాలు. కాని ధర్మాది పురుషార్థాలసిద్ధికై వేదం వేర్వేరు నామరూపాలను కల్పించింది. కర్మలను నియమించడానికే దేశ, కాల, ధ్యానాదులకు గుణదోషాలను విధించాను. కృష్ణసారం లేనిప్రదేశం, బ్రాహ్మణభక్తిలేని దేశం అపవిత్రమైనవి. కృష్ణ సారమృగము కలదయినా సౌవీరదేశంతప్ప ఇతరదేశాలు సంస్కారరహితాలు. ద్రవ్యంతోగాని, స్వయంగాగాని కర్మ చేసే కాలం పవిత్రమైంది. కర్మ చేయడానికి సామగ్రి లభించని కాలము, ఆగంతుకాలైన దోషాలవల్ల లేక సహజాలైన దోషాలవల్ల కర్మను గూడ చేయడానికి వీలుపడని కాలం అపవిత్రమైంది. పదార్థాల శుద్ధ్యశుద్ధులు ద్రవ్య, వచన, సంస్కార, కాలాలవల్ల మహత్వం లేక అల్పత్వం వల్ల కూడ వుంటాయి. శక్త్యశక్తులను బట్టి, బుద్ధినిబట్టి, సమృద్ధిని బట్టి జీవులు పాపాలు చేస్తున్నారు. ఈ విధంగా చేయడం దేశకాల పరిస్థితులవలననే అని తెలుసుకోవాలి. ధాన్యం, కఱ్ఱ, ఏనుగుదంతాలు, ఎముకలు, తైల ఘృతాదిరసద్రవ్యాలు బంగారం మొదలైన తైజస పదార్థాలు,. చర్మం, మట్టి వికారాలైన ఘటాది పదార్థాలు, కాలం, గాలి, నిప్పు, మట్టి, నీరు అనేవాటి సంబంధం చేత పవిత్రాలౌతాయి.

ఒకవస్తువుకు అసహ్యామైన పదార్థమేదైనా అంటుకుంటె మట్టిరుద్దేదానివలన ఆపదార్థానికి గంధలేపముండదు. ముందున్నరూపానికే వస్తే ఆవస్తువు పవిత్రమైనదని భావించాలి. స్నానం, దానం, తపస్సు, వయస్సు, శక్తి ఉపనయనం మొదలైన సంస్కారాలచేత, సంధ్యోపాసనాది కర్మలచేత, నామస్మరణం చేత కర్త శుద్ధుడౌతాడు. ఈ కర్మలన్నింటిచేత

శుద్ధుడై కర్మలు చేయాలి. సద్గురువు ముఖంనుండి వెలువడిన మంత్రం పవిత్రమవుతుంది. కర్మను నాకు సమర్పించడం వల్ల శుద్ధమవుతుంది. ఇదేవిధంగా దేశ, కాల, ద్రవ్య, కర్త, మంత్ర, కర్మలనే ఈ ఆరు పవిత్రములై ధర్మసంపన్నమవుతాయి. అపవిత్రమైతే అధర్మమేర్పడుతుంది. కొన్నిచోట్ల గుణం దోషమవుతుంది. దోషం విధివశాత్తు గుణమవుతుంది. ఒకేవిషయంలో గుణదోషాల ఈ నియమం గుణదోషాలభేదానికి బాధకమవుతున్నది. పాపాలు చేయడం వల్ల పతితులు కాని వాళ్ళు కూడా పతితులౌతారు. ముందే పతనమైన వాడు మరల చెడిపోడు. అదేవిధంగా ఋతుకాలంలో భార్యను కలవడం యతులకు దోషమైనా గృహస్థులకు దోషం కాదు. మానవుడు ఏ విషయాలను వదిలేస్తాడో వాటినుండి ముక్తుడౌతాడు. నివృత్తిలక్షణం జీవులకు సుఖాన్ని కలిగిస్తుంది. శోకమోహాలను పోగొడుతుంది. విషయాలగురించి ఆలోచించడం వల్ల జీవులు విషయాసక్తులౌతారు. ఆసక్తివల్ల కామం, కామంవల్ల కలహం కలుగుతాయి. కలహంవల్ల సహించలేని కోపం కలుగుతుంది. కోపాన్నిబట్టి మోహముంటుంది. మోహం మానవుని కార్యాకార్యాలను నిర్ణయించే వ్యాపకమైన చేతనాశక్తిని మింగేస్తుంది. కార్యా కార్య జ్ఞాన శూన్యుడు వుండినా లేనివాడవుతాడు. అపుడు చేతనత్వంలేనివాడు, చనిపోయినవానివలె వున్నవాడు అయిన జీవుడు భ్రష్టుడవుతాడు. చేతనాశూన్యుడైన మనిషి విషయాలలో ప్రావీణ్యం కలవాడై తనను పరమాత్మను గుర్తించలేడు. చెట్టులాగా ప్రాణధారణోపయోగాలైన విషయాలను గ్రహిస్తాడు. కొలిమితిత్తిలాగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలను ఊరకే విడుస్తాడు. అతడు జీవన్మృతుడు. జీవుడికి కర్మవల్ల కలిగే స్వర్గాదిఫలాలు పురుషార్థాన్నీయవు. తండ్రి తీపి పదార్థాన్ని తినిపిస్తూ కుమారుడికి ఔషధ సేవనలో రుచిని

కలిగిస్తాడు. అదేవిధంగా వేదశాస్త్రాలు మోక్షరూపమైన శ్రేయస్సును గురించి చెప్పుటకే జీవులకు కర్మలలో రుచిని కలిగిస్తున్నాయి. జీవులు సాధారణంగా తమకనర్థాన్ని కలిగించే పశువులలో, ఆయుష్షు, ఇంద్రియాలు, బలం, వీర్యం మొదలైనవాటిలో కుమారులలో ఆసక్తులై వుంటారు.

కాబట్టి సుఖాన్ని తెలిసికోనివాడు, కామపుత్రోవలో తిరిగేవాడు, తామసయోనులలో ప్రవేశించే స్వభావం గలవాడు, వేదవాక్యాన్ని నమ్మినవాడు అయిన జీవుని వేదశాస్త్రాలు మళ్ళీ కామ ప్రవృత్తునిగా చేయవు. దుర్బుద్ధులు కొందరు వేదాలలోని ఈ అభిప్రాయాలను తెలిసికోలేక అవాంతర ఫలితాలనిచ్చే శ్రుతివాక్యాలే పరమఫలమని చెప్పారు. కాని వేదజ్ఞులలా చెప్పలేదు. అటువంటి దుర్బుద్ధులైన కర్మవాదులు కాముకులు, దీనులు, లుబ్ధులు కాబట్టి అవాంతరఫలాన్ని పరమఫలమని తెలిసికొని అగ్ని సాధ్యాలైన కర్మలలో అభినివేశం కలవారౌతారు. దానివల్ల జ్ఞానహీనులు చివరికి ధూమమార్గావలంబులై ఆత్మతత్త్వాన్ని తెలుసుకోలేరు. అంధులు దగ్గరున్న వస్తువునుగూడ చూడలేరు. అదేవిధంగా పశుహింసాసాధనమైన కర్మ శస్త్రంగా కలవారు, ప్రాణతర్పణ పరాయణులైన కర్మవాదులు ఈ జగత్తుకు కారణభూతుడను, అంతర్యామిని అయిన నన్ను తెలిసికోలేరు.

మాంసం తినాలంటే యజ్ఞంలో హింసచేసితినాలి. ఇది పరిసంఖ్యావిధి. హింసాపరాయణులైన కర్మవాదులు స్వర్గసుఖాలను పొందాలని పశుమాంసంచే దేవతలను, పితృదేవతలను, భూతాలను ఆరాధిస్తున్నారు. అలాంటి మందబుద్ధులు కలితో సమానం. నశించేది కేవలశ్రవణానందం అయిన పరలోకాన్ని, ఇహలోకంలోని రాజ్యాలను సుఖాలని భావించి ఎక్కువ డబ్బు సంపాదించాలనుకుని వున్నది పోగొట్టుకునే వ్యాపారిలాగా యజ్ఞాలలో ఎక్కువ ఖర్చుచేసి రెండువిధాలా నష్టపోతారు. ఇంద్రాది ముఖ్యదేవతలు

నా అంశులే. రజస్సత్త్వ తమోనిష్ఠులైన వారు వారిని నాకంటె వేరనేభావంతో ఆరాధిస్తున్నారు. ఇది మంచి ఉపాసన కాదు.

ఈలోకంలో మేము యజ్ఞాలు చేస్తాము తద్వారా దేవతలనారాధించి స్వర్గంలో విహరిస్తాము. స్వర్గసుఖాలు అయిపోగానే మళ్ళీభూలోకంలో మంచి వంశంలో మహాభవనంలో జన్మిస్తామని అనుకుంటారు. మెత్తనైన మనోహరమైన ఇటువంటి వేదవాక్యంచే విక్షిప్తచిత్తులు, అతిలుబ్ధులు, అభిమానులు అయిన మనుష్యులు నా కథాప్రసంగంలో ఆసక్తి కలిగివుండరు.

వేదాలు మూడురకాలుగా విభజింపబడ్డాయి. కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ. ఈమూడింటిలో బ్రహ్మమే ఆత్మ అనే విషయం ప్రతిపాదింపబడింది. ఋషులు ఈ విషయాన్ని పరోక్షంగా చెప్పారు. ఈ విధంగా రహస్యంగా చెప్పటమే నా కిష్టం. శబ్దబ్రహ్మం వేదం, స్వరూపంగా గాని, అర్థంగా గాని అది తెలుసుకోలేనిది. ప్రాణమయం, ఇంద్రియమయం, మనోమయం అయినది. అనంతం, అపారం, గంభీరమైన సముద్రంలా దాటనలవికానిది. అనంత శక్తిమంతుడనైన నాచే పెంపొందించబడిన ఆ శబ్దబ్రహ్మము తామరతూడులోని దారంలాగా ప్రాణులలో శబ్దరూపంతో కనపడుతున్నది. సాలెపురుగు హృదయం నుండి ముఖంనుండి దారాలను వదలునట్లు ఛందోమయుడు, అమృతమయుడు శబ్దరూపమైన ఉపాదానంతో గూడిన భగవానుడు స్పర్శాది వర్ణరూపమైన మనస్సుతో హృదయాకాశం నుండి ఓంకారవ్యంజితాలైన స్పర్శస్వరోష్మాంత స్థలాలచే విభూషితమైనట్టి, విచిత్రములైన వైదిక లౌకిక భాషాదులతో విస్తృతమైనట్టి అనంతం, అపారం అయిన శ్రుతిని స్వయంగా సృష్టిస్తున్నాడు. ఉపసంహరిస్తున్నాడు.

గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి త్రిష్టుప్, జగతి,

అతిచ్ఛందం, అత్యష్టి, అతిజగతి, అతివిరాంట్ అనే ఈ ఛందస్సులన్నీ వైఖరీ వేదానికి సంబంధించినవి.

కర్మకాండ విధివాక్యాన్ని, ఉపాసనాకాండ మంత్రవాక్యాన్ని, జ్ఞానకాండ నిషేధవాక్యాన్ని తెలిపాయి. వీటర్థం నాకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. వేదాలు కర్మకాండలో నన్నే విధిస్తున్నాయి, ఉపాసనాకాండలో ఉపాస్య దేవతారూపంలో నన్నే వర్ణిస్తున్నాయి. జ్ఞాన కాండలో ఆకాశాది రూపంతో నాలో వేరే వస్తువుల నారోపించి వాటిని నిషేధిస్తున్నాయి. అన్ని శ్రుతులు నన్నాశ్రయించి నాలో భేదాన్నారోపిస్తున్నాయి. మాయామాత్రుడని చెప్పి దానిననువదిస్తున్నాయి. చివరికన్నింటిని నిషేధించి నాయందే శాంతిని పొందుతున్నాయి. అధిష్ఠానరూపంతో నేనే మిగులుతున్నాను.



## పదిహేడవ అధ్యాయము

ఉద్ధవుడు :- ప్రభో! ఋషులు తత్త్వాలు ఎన్ని రకాలని చెప్పారు? నీవు ఇరవైఎనిమిది తత్త్వాలని చెప్పగా విన్నాము. కొందరు ఇరవై ఆరు తత్త్వాలని, కొందరు ఇరవైఅయిదు తత్త్వాలని, ఇంకొందరు ఏడని, మరికొందరు తొమ్మిదని, కొందరు ఆరని, కొదరు నాలుగని, కొందరు పదకొండని చెప్తున్నారు. కొందరు ఋషులు వాటిని పదిహేడని, ఇంకొందరు పదహారని, మరికొందరు పదమూడని చెప్తున్నారు. ఋషులు ఇన్నిరకాల తేడాలతో ఎందుకు చెప్తున్నారు? వివరించు.

భగవంతుడు :- అన్ని తత్త్వాలు అన్నింటిలోను లీనమై వుండడంచేత వేదజ్ఞులైన బ్రాహ్మణులు ఈ విషయంలో చెప్పింది సత్యమే. వాళ్ళందరూ నామాయా శక్తినాశ్రయించి తత్త్వాలను వర్ణించారు. ఏ తత్త్వాల గురించి "నీవు ఏవిధంగా చెప్తున్నావో, ఆయా తత్త్వాల గురించి అట్లుకాదని నేను చెప్తున్నాను". అనే మానవుల వాదానికి నా శక్తులే కారణాలు. నీ ఈ సత్త్వాది శక్తుల క్షోభం వల్లనే వాదించేవాళ్ళ విషయంలో భేదమేర్పడింది. శమదమాలను పొందినాక ఆ వికల్పాలు గూడ లయమవుతాయి. వికల్పాలు నశించిన తర్వాత వివాదాలు గూడ ఉపశమిస్తాయి. తత్త్వాలు ఒకదానిలో ఒకటి కలిసివుంటాయి, కాబట్టి వక్తలు చెప్పినట్లుగా అవి కార్యకారణభావంతో పరిగణింపబడతాయి. ఈ ప్రపంచములో ముందుజరిగిన కారణతత్త్వంలో ఇతర కార్యతత్త్వాలలో కారణతత్త్వాలు అనుగతరూపంగా ప్రవేశించినట్లు కనపడతాయి. కాబట్టి తత్త్వాల కార్యకారణభావాన్నిగాని, ఎక్కువతక్కువ భావాన్నిగాని, యుక్తి ననుసరించి గ్రహింతుము.

ఆది నుండి జీవుడు అవిద్యాగ్రస్తుడు. కాబట్టి తన్ను తాను తెలుసుకోలేకున్నాడు. అతనికి ఆత్మజ్ఞానాన్ని బోధించడానికి ఇంకొక జ్ఞానప్రదాత అవసరం. జీవేశ్వరులకిద్దరికీ చిద్రూపంలో భేదంలేదు. భేదం కల్పించడం కూడ వ్యర్థమే. అదేవిధంగా జ్ఞానం కూడా ప్రకృతికన్న భిన్నం కాదు. సత్త్వాదిగుణాల సామ్యావస్థయే ప్రకృతి. ఈ ప్రకృతికి సంబంధించిన సత్త్వరజస్తమోగుణాలు సృష్టిస్థితిలయాలకు హేతువులు. ఈ మూడు గుణాలు ప్రకృతికి సంబంధించినవే కాని ఆత్మకు సంబంధించినవి కావు. ఈ చర్చలో సత్త్వగుణమే జ్ఞానం. రజోగుణమే కర్మ. తమోగుణమే అజ్ఞానం అని చెప్పబడ్డాయి. గుణాలలో బాధను కలగజేసే ఈశ్వరుడే కాలము, సూత్రము. అంటెమహత్తత్త్వమే స్వభావమని చెప్పబడింది. పురుషుడు, ప్రకృతి, మహత్తు, అహంకారం, ఆకాశం, వాయువు, తేజస్సు, నీరు, భూమి అనే ఈ తొమ్మిది తత్త్వాలగురించి నేను వర్ణించాను. చెవి, చర్మం, కళ్ళు, ముక్కు, నాలుక అనే అయిదు జ్ఞానేంద్రియాలు. వాక్పాణి పాయూపస్థ పాదాలు అనే ఐదు కర్మేంద్రియాలు. ఉభయాత్మకమైన మనస్సు పదకొండవతత్త్వం. శబ్ద స్పర్శరూపరస గంధాదులైదు జ్ఞానేంద్రియాలకు విషయాలు. వీటిమార్పువల్ల ఆకాశాది పంచమహాభూతాలు సృష్టింప బడ్డాయి. గతి, ఉక్తి ఉత్సర్గం, శిల్పం అనేవి కర్మేంద్రియాలకు ఫలాలే కాని తత్త్వాలలోనివికావు. కార్య కారణరూపిణి అయిన ప్రకృతి ఈ ప్రపంచాన్ని సృష్టించేటప్పుడు సత్త్వాదిగుణాల వల్ల ప్రపంచ సృష్టి స్థితిలయాలకు సంబంధించిన అవస్థలను ధరించి సృష్టికార్యాన్ని నిర్వహిస్తున్నది. అవ్యక్తపురుషుడు దీనినంత సాక్షిగచూస్తున్నాడు. పురుషుని చూపుచేత ప్రకృతినుండి పుట్టిన మహత్తత్త్వాది ధాతువులన్ని ఒకదానికొకటి కలిసి ప్రకృతి నాశ్రయించి బ్రహ్మాండాన్ని సృష్టిస్తాయి. ఏడు తత్త్వాలు అనే వారిదృష్టిలో పంచమహాభూతాలు, జీవుడు, ఆ ఇరువురికి ఆశ్రయుడైన పరమాత్మ దేహం, ఇంద్రియాలు ప్రాణం

అనేవన్నీ ఈ ఏడు తత్త్వాలనుండి పుట్టినవే. పంచమహాభూతాలు ఆరవవాడు పరమపురుషుడు ఆరుతత్త్వాలంటె ఇవే. ఆ పరమాత్మ తననుండి పుట్టిన మహాభూతాలద్వారా పరిదృశ్యమానమైన ప్రపంచాన్ని సృష్టించి స్వయంగా తాను దానిలో ప్రవేశిస్తున్నాడు. తత్త్వాలు నాలుగని చెప్పేవాళ్ళదృష్టిలో భూమి, జలం, తేజస్సు, ఆత్మ అనే నాలుగింటినుండి కార్యసృష్టి జరిగింది. దాని నుండి ప్రపంచం పుట్టింది. పదిహేడని చెప్పేవాళ్ళదృష్టిలో పంచమహా భూతాలు, పంచతన్మాత్రలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు, ఆత్మఅనేవి. పదిహేడుతత్త్వాలని చెప్పేవాళ్ళలాగానే పదహారు తత్త్వాలని చెప్పేవాళ్ళ దృష్టివున్నది. వీళ్ళదృష్టిలో మనస్సు ఆత్మ వేరు కాదు. అంటే మనస్సు ఆత్మలోనిదే. కొంతమంది పదమూడు తత్త్వాలని చెప్తున్నారు. అవి పంచమహాభూతాలు, పంచేంద్రియాలు, మనస్సు జీవాత్మ, పరమాత్మ. కొంతమంది పదకొండు తత్త్వాలని అవి పంచమహాభూతాలు, పంచేంద్రియాలు, ఆత్మ అని, కొంతమంది తొమ్మిది తత్త్వాలని అవి అష్టప్రకృతులు, పురుషుడు అని చెప్తున్నారు. వాళ్ళు చెప్పిందియుక్తం, సత్యం. పండితులు చెప్పింది కూడ అసత్యం కాదు.

ఉద్ధవుడు :- కృష్ణా! ప్రకృతి పురుషులిద్దరూ విలక్షణస్వభావులు. అయినా కలిసివుండడం వల్ల భేదం కనపడదు. కాని ప్రకృతికార్యమైన దేహమునందు ఆత్మ, ఆత్మయందు ప్రకృతి గుర్తింపబడతాయి. యుక్తియుక్తమైన మాటలతో నామనసులో వున్న సందేహాలు తొలగించు. నీ అనుగ్రహం వల్ల మనుషులకు జ్ఞానం, మాయాశక్తివల్ల జ్ఞాననాశనం కలుగుతున్నవి. సమాయం శక్తిస్వరూపాన్ని నీవుతప్ప ఇంకెవరూ తెలుసుకోలేరు.

భగవంతుడు :- ఉద్ధవా! ప్రకృతిపురుషులలో చాలా తేడా వుంది.

గుణవ్యతికరం వల్ల కలిగిన దేహాది సంఘాతం వికారంతో కూడినదని తెలుసుకో. గుణమయమైన నామాయ సత్వాది గుణాల ద్వారా అనేక భేదబుద్ధులను సృష్టిస్తున్నది. ఈ భేదం అనేకవికారాలతో కలిసివున్నా అధ్యాత్మం, అధిభూతం, అధిదైవం అనే భేదత్రయాన్ని కలిగివున్నది.

నేత్రేంద్రియం అధ్యాత్మం, దానివిషయరూపం అధిభూతం, నేత్రగోళము నందున్న సూర్యదేవతాంశం అధిదైవం ఈ మూడా పరస్పరాశ్రయంతో సిద్ధమవుతున్నాయి. సూర్యుడుమాత్రం స్వయంగా సిద్ధవస్తువైవున్నాడు. స్వపరప్రకాశమునందు ఆయనకు వేరే అపేక్షలేదు. ఈ విధంగానే ఆత్మకూడ ముందుచెప్పిన మూడు భేదాలకు మూలకారణంగా వుంది. అందువల్ల ఒకేరూపం, తేడా లేనిది అయిన నా ఆత్మ వీటి కంటె భిన్నరూపమున స్వప్రకాశంద్వారా నిఖిలప్రకాశక వస్తువులను కూడ ప్రకాశింపచేస్తున్నది. నేత్రానికున్నట్లు త్వక్కు శ్రోత్రం, జిహ్వ, నాసిక, చిత్తం మొదలైన వాటికి కూడ మూడే భేదాలున్నాయి. గుణక్షోభకరుడైన పరమేశ్వరునిగాని, కాలాన్నిగాని నిమిత్తంగా చేసుకొని ప్రధాన మూలకమైన మహత్తత్త్వం నుండి పుట్టిన వికారాత్మకమైన అహంకారం – వైకారికం, తామసం, ఇంద్రియం అనే మూడురకాల వికారాలకు కారణమైవుంది. అఖండజ్ఞాన స్వరూపమైన ఆత్మవుందాలేదా అనే భేదజ్ఞాన కారణమైన వివాదం వ్యర్థం. అయితే నా నుండి బహిర్ముఖులయిన పురుషులలో ఈ వివాదం ఎప్పుడూ నివృత్తి కాదు.

ఉద్ధవుడు:– దేవా! నీ మీద మనసు నిలపని మానవులు వాళ్ళవాళ్ళ కర్మలననుసరించి ఉచ్చనీచాలైన దేహాలను ధరిస్తారు. త్యజిస్తారు. అల్పులు ఈ విషయాన్ని తెలుసుకోలేరు. అటువంటి విషయాన్ని నాకు వివరించు, ప్రపంచంలో ప్రతిప్రాణీ సమాయకు లోబడిందే. కాబట్టి నీ తత్వాన్ని గురించి

తెలుసుకొనే వాళ్ళే లేరు.

భగవంతుడు:- పంచేంద్రియాలతో కూడిన ఈ దేహంనుండి ఇంకొకదేహానికి మనస్సు పయనిస్తుంది. ఆత్మదేహభిన్నమైనా అహంకారం ద్వారా మనస్సుననుగమిస్తుంది. కర్మాధీనమైన మనస్సు చూడగలిగిన, చేయగలిగిన, వేదాలలో చెప్పబడిన విషయాలను ఆలోచిస్తూంటుంది. ఆలోచించే విషయాలనుండి పుట్టి మళ్ళీవాటిలోనే లీనమవుతుంది. తరువాత దాని స్మృతి నశిస్తుంది. కర్మ ఫలానురూపమైన ప్రస్తుతదేహానికి తర్వాత లభించే దేహగతాలైన సుఖదుఃఖాలలో అత్యంత అభినివేశం వల్ల పూర్వదేహ విస్మృతి కలుగుతుంది. అదే జీవులకు మృత్యువు. ఉద్ధవా! స్వప్నమనోరథాలు అభిమాన మంత్రాలైనట్లు ఒకేరూపమైన దేహంలో అభిమానమే జీవుని జన్మఅని చెప్పబడింది. ప్రస్తుతదేహంలో వుండే జీవుడు వెనుకటిదేహాన్ని స్మరింపడు. కాని పూర్వసిద్ధమైన ప్రస్తుతదేహంలో వున్న ఆత్మను సద్యోజాతం లాగా అనుభవిస్తాడు. జీవుడు కలలో అనేకరకాలైన లేనిదేహాలను సృష్టిస్తూ, దర్శిస్తూ చాలారూపాలుగా వెల్లడి అవుతాడు. అలాగే మనస్సుయొక్క దేహా-తరాభినివేశం వల్ల ఆత్మలోగూడ ఉత్తమ, మధ్యమ, అధమాలైన త్రివిధభావాలు లేనట్లుగా వెల్లడౌతాయి. ఈ ఆత్మే బాహ్యాభ్యంతర భేదానికి కారణమవుతుంది. అలక్ష్యవేగమైన కాలగమనంలో శరీరాలు పుడ్తూగిడ్తూ వున్నాయి. కాలగతి చాలాసూక్ష్మం, కాబట్టి అజ్ఞానులు దానిని చూడలేరు, కాలమార్పిడివల్ల అగ్నిజ్యోతిస్సులకు, ప్రవాహంవల్ల స్రోతస్సునకు, పర్వతాది రూపాలవల్ల చెట్లు ఫలాలకు విశేషావస్థలుంటాయి. ఆ విధంగానే వయోవస్థాదులవల్ల అన్ని శరీరాలకు మార్పు కలుగుతుంది. అయినా జ్వాలకు కారణం నా ఈ దీపమనీ, స్రోతస్సుకు కారణం ఆయాజలమన, జ్ఞానం కలుగునట్లె అవివేకులయిన వ్యక్తులకు ఆతడే ఈ పురుషుడు అనే మిథ్యాబుద్ధి,

మిథ్యావాక్కులు కలుగుతాయి. జీవుడు తన జన్మకు కారణములైన జననమరణాలు పొందదు. కాని కల్పాంతం వరకు వుండే మహాభూత రూపమైన అగ్ని కాష్ఠసంయోగవియోగాలచేత పుట్టుక, చావు పొందునట్లు జీవుడు గూడ అజుడు అమరుడు అయినా భ్రాంతివలన పుట్టుక, చావు కలవానివలె గుర్తిపబడతాడు.

నిషేకం, గర్భం, జననం, బాల్యం, కౌమారం, యౌవనం, ప్రౌఢత్వం, వార్ధక్యం, మరణం అనే ఈ తొమ్మిది శరీరావస్థలు, జీవుడు కర్మవల్ల మనోవికారజనితాలు, ఉత్కృష్టాపకృష్టాలు అయిన శరీరావస్థలను తనవిగా అనుకుని అభిమానపడతాడు. ఒక్కోసారి దేవుని దయవలన తెలివితో అభిమానాన్ని వదిలేస్తాడు. కొడుకు పుట్టడం వల్ల తండ్రి, తండ్రి చనిపోవడం వల్ల కొడుకు జననమరణాలు వాళ్ళ వాళ్ళ దేహాలకే అని తెలుసుకోవాలి. కాని శరీరంచావుపుట్టుకలమయమని తెలుసుకున్న జీవుడు ఈ రెండు లక్షణాలు లేనివాడై వుంటాడు. గింజ నుండి చెట్టు పుట్టుకను, పండిన తర్వాత చావును చూచి మానవుడు ఇవి చెట్టుకంటే వేరైనవని తెలిసికొంటాడు. ఆవిధంగానే శరీరంయొక్క చావుపుట్టుకలు చూచే మానవుడు వాటిని శరీరంకంటెవేరని తెలిసికుంటాడు. స్వరూపాన్ని తెలిసికోని పురుషుడు ఆత్మ ప్రకృతి కంటె భిన్నమైనదని తెలిసికొనక విషయాలలో ఆసక్తుడై దేహాభిమానం వల్ల సంసారదశను పొందుతాడు. జీవుడు కర్మలనుబట్టి సత్త్వగుణం ఎక్కువగా వుంటె రాక్షసత్వ మనుష్యత్వాలను, తమోగుణం ఎక్కువగావుంటె భూతపశుపక్షిజన్మలను పొందుతాడు. నాట్యంచేసే వానిని పాటలు పాడే వానిని అనుకరించే వ్యక్తిలాగా జీవాత్మ నిష్క్రియుడై బుద్ధి గుణాలననుసరిస్తాడు. నీటిలో కనపడే చెట్లు నీటి కదలికతో తాము గూడ కదులుతున్నట్లు కనపడతాయి. అదే

విధంగా కళ్ళుతిరుగుతుంటె భూమికూడ తిరుగుతున్నట్లు అనిపిస్తుంది. మనోరథబుద్ధులు, స్వప్నబుద్ధులు మిథ్య అయినట్లు జీవుని విషయభోగాలు, సంసారం కూడ మిథ్యే అని తెలుసుకోవాలి విషయాలను ధ్యానించే జీవుడు కలలో అనేకరకాలైన విషయాలనుభవిస్తాడు. అదేవిధంగా ఆత్మకు సంసారబంధం మిథ్యఅయినా విషయధ్యానం వల్ల సుఖదుఃఖాలు కలుగుతాయి. కాబట్టి ఉద్ధవా! చెడ్డవైన ఇంద్రియాలద్వారా విషయాలను సేవించకూడదు. కలలో కనిపించే స్వప్నరూపంయొక్క అజ్ఞానం వల్ల వికల్పం కలుగుతుంది. దానివల్ల భ్రమ కలుగుతుంది. దుష్టులచేత తరిమి కొట్టబడినా, అవమానింపబడినా, ఎగతాళిచేయబడినా, నిందితుడైనా, కొట్టబడినా, బంధించబడినా, జీవితంలో వంచింపబడినా, ఎంగిలి ఉయ్యబడినా, మూత్రంపోసినా ఎన్నిరకాలుగా బాధింపబడ్డా శ్రేయస్కాముడైన జీవుడు తన బుద్ధితో భగవంతుని శరణుకోరి తన్నుతాను కాపాడుకోవాలి.

ఉద్ధవుడు :- మాటలాడేవారిలో గొప్పవాడివైన కృష్ణా! నీ ఉపదేశాలన్నీ నాకు బాగా వివరించు. విశ్వాత్మా! ప్రకృతి బలీయమైనది. కాబట్టి త్వద్ధర్మ నిరతులు అంటె శ్రవణ కీర్తనాదులలో నిరతులు, నీ పాదాల నాశ్రయించినవారు, శాంతస్వభావులైన భక్తులేకాక పండితులు కూడ ఈ విధంగా అవమానాలను సహించడం చాలా కష్టమనుకుంటాను.



## పదునెనిమిదవ అధ్యాయము

శుకుడు :- భక్తముఖ్యుడైన ఉద్ధవుడు అడిగిన ప్రశ్నను పొగుడుత్తూ శ్రీ కృష్ణుడిలా పలికాడు. ఉద్ధవా! దుష్టజనుల దుర్వాక్యాలను వినికూడ మనస్సును శాంతపరచుకొనే సాధువులెవ్వరూ ఈ లోకంలో లేరు. పరుషమైన మాటలు బాధించునట్లు బాణాలు కూడా బాధించవు. దీనికి సంబంధించిన కొక కథ చెప్తా విను.

ఒక భిక్షుకుడు దుర్జనుని చేత అవమానితుడై ధైర్యంతో అది తన పూర్వజన్మకర్మగా తలచి ఈ విధంగా పాడాడు. మాలవదేశంలో ఒక బ్రహ్మణుడు వుండినాడు. అతను ధనవంతుడు, వ్యాపారి, భార్యాబిడ్డలను బాధించేవాడు, కాముకుడు, లుబ్ధుడు, కోపిష్టి అతడెప్పుడూ తెలిసినవాళ్ళను, అతిథులను కనీసం మాటలతో కూడ తృప్తిపరచేవాడు కాడు. పనికిరాని ఇంటిలో నివసించేవాడు. తన దేహానికి కూడ అవసరమైన పదార్థాలను పెట్టేవాడు కాడు. దుశ్శీలుడైన వానికి భార్య, కూతురు, సేవకులు ఎప్పుడూ సంతోషాన్ని కలుగచేయలేదు. ఈ విధంగా యక్షునిలాగా డబ్బును కాపాడేవాడు, ధర్మకర్మ హీనుడు అయి ఉభయలోకభ్రష్టుడయిన ఆ బ్రహ్మణుని పై పంచయజ్ఞభాగులైన దేవతలు కోపించారు. దానశీలుడవైన ఉద్ధవా! దేవతలనారాధించనందువలన అతని పుణ్యం క్షీణమయ్యింది. కష్టపడి సంపాదించిన డబ్బుకూడా పోయింది. అతని డబ్బులో కొంత దొంగలు, జ్ఞాతులు, రాజులు హరించారు. దైవవశాత్ కొంత, కాలవశాత్ కొంత తస్కరింపబడింది. ఈ విధంగా అంతాపోగొట్టుకొని ధర్మకామవర్జితుడై తనవాళ్ళచే ఉపేక్షింపబడి కడుదుఃఖంలో మునిగిపోయాడు. ధనలేమితో దుఃఖించేవాడు, దీర్ఘాలోచనాపరుడు, క్లిష్టుడు, బాష్పకంఠుడు, ఖేదపరాయణుడు అయిన బ్రాహ్మణునికి తీవ్రవైరాగ్యం కలిగింది. అయ్యో!

ఎంతోకష్టపడి సంపాదించిన ధనం ధర్మానికి, భోగానికి ఉపయోగపడక వ్యర్థమయ్యింది. ఈ దేహాన్ని కష్టాలపాల్జేశాను. ఈ కష్టం భరించలేనిది అని ఆబ్రాహ్మణుడు, అనుకున్నాడు. సాధారణంగా పిసినారివాని సంపదలు సుఖాన్నీయవు. ఈ సంపదలు ఈ లోకంలో కష్టాలకు పరలోకంలో నరకానికి కారణాలవుతాయి. కుష్ఠువ్యాధి కొంచెమైనా కీర్తిని, సద్గుణాలను నాశనం చేస్తుంది. అర్థార్జనలో ఆర్జించిన దానిని పెంపొందించు కోవటంలో, కాపాడుటలో, ఖర్చు చేయుటలో, పొగొట్టుకోవటంలో, అనుభవించుటలో, జనులకు శ్రమ, భయం, చింత, భ్రమ ఎదురౌతాయి.

దొంగతనం, హింస, అసత్యం, దంభం, కామం, ఆశ్చర్యం, గర్వం, భేదబుద్ధి, వైరం, అవిశ్వాసం, వైరం, స్త్రీవ్యసనం, జూదం, మద్యం అనే ఈ పదిహేనువ్యసనాలు డబ్బువల్ల కలుగుతాయి. కాబట్టి మంచికోరేవాడు వీటికి దూరంగా వుండాలి. ధనం వల్ల సోదరులు, బార్యలు, తల్లిదండ్రులు, బంధువులు, మిత్రులు వెంటనే శత్రువులౌతారు. సామాన్యమైన డబ్బుకోసం సోదరులను వదిలేస్తారు. చివరికి వైరంతో వాళ్ళను చంపేస్తారు.

మానవజన్మను దేవతులు గూడ ప్రార్థిస్తారు. అందులో బ్రాహ్మణత్వాన్ని ఆదరించకపోతే అధోగతిపాలౌతారు. స్వర్గమోక్షాలకు ద్వారమైన దేహాన్నిపొంది అనర్థాలకాశ్రయమైన ధనమునందు మరణ ధర్మశీలుడైన ఏవ్యక్తీ ఆసక్తుడు కాడు. యక్షునిలాగా ధనాన్ని కాపాడే వ్యక్తి దేవతలను, ఋషులను, జ్ఞాతులను, బంధువులను, దాయాదులను వాళ్ళ భాగము వాళ్ళకిచ్చి సంతోషపెట్టకపోతే, తాననుభవించుకున్నా హీనుడౌతాడు. తెలివైనవాళ్ళు ధనంచే సిద్ధిని పొందుతున్నారు. పనికిరానిధనార్జనవ్యాపారం చేత మోహితుడనై నాడబ్బును, వయస్సును, బలాన్ని పోగొట్టుకున్నాను. ఇక ముసలితనంలో ఏమి సాధించగలను? . పండితుడు డబ్బుసంపాదన

కోసం వ్యర్థంగా బాధింపబడుతున్నాడు. మాయవల్ల ఇదంతా జరుగుతున్నదనేది నిజం. చావు ఆవహించిన జీవుడికి డబ్బువల్ల, డబ్బుతో వచ్చే వస్తువులవల్ల, భోగవాసనలవల్ల, భోగాలను కలిగించే వస్తువులవల్ల ఏమీ లాభం కలుగదు. జన్మనిచ్చే కర్మలు ఏమీ చేయలేవు. ఎవరిదయవలన నాకీ డబ్బులేని దశ కలిగిందో, ఎవరి దయవలన నాకు వైరాగ్యం కలిగిందో అటువంటి సర్వదేవమయుడైన శ్రీ హరి నాకు ప్రసన్నుడైనాడు, ఇంకా జీవించివుంటె నేను ధర్మాదులతో జాగరూకుడనై ఆత్మసంతుష్టుడనై తపస్సు చేత శరీరాన్ని ఎండబెట్టుకుంటాను. ఈ విషయంలో ముల్లోక దేవతలు నన్ననుగ్రహిస్తారు. వాళ్ళ అనుగ్రహంవల్లనే ఖట్వాంగరాజు వైకుంఠాన్ని పొందాడు.

భగవంతుడు:- ఈ విధంగా ఆ బ్రాహ్మణుడు అహంకార మమకారాలను వదలి శాంతుడు, సన్న్యాసి, ముని అయ్యాడు. ఆ సన్న్యాసి ఇంద్రియాలను నిగ్రహించుకొని దీనంగా, ఏ ఆసక్తి లేనివాడై అన్నిగ్రామాలు, నగరాలు తిరగేవాడు. దుర్జనులు ఆ భిక్షుకుని నానారకాల అవమానించారు. కొందరు త్రిదండాన్ని కొందరు భిక్షాపాత్రను, కొందరు కమండలాన్ని కొందరు ఆసనాన్ని, కొందరు జపమాలను, కొందరు బొంతను దొంగిలించారు. కొందరు కొన్ని వస్తువులను ఇచ్చినట్టె ఇచ్చి లాక్కునేవారు. భిక్షలో దొరికిన అన్నన్ని భుజిస్తుండగా పాపిష్ఠులు కొందరు అతని అన్నంలో మూత్రవిసర్జన చేసేవారు. నెత్తిపై ఎంగిలి వూసేవారు. ఆ సన్న్యాసిని కొందరు అనేకవిషయాల గురించి అడిగేవాళ్ళు. అతను చెప్పకపోతే కర్రలతో కొట్టేవాళ్ళు. కొందరు దొంగ అని బెదిరించే వాళ్ళు. పట్టుకోండి పట్టుకోండని కొందరు దొరకడంతో కట్టివేసేవాళ్ళు. కొందరు ఇతనిని ధర్మధ్వజుడని, లోకవంచకుడని, ధనమంతా పోగొట్టుకున్నందువల్ల ఇతనిని

బంధువులు వదిలేశారని అప్పటినుండి ఇతను అడుక్కుంటున్నాడని తిట్టేవారు. కొదరు ఇతను చాలా బలవంతుడు కొండలాగా ధైర్యవంతుడు. కొంగలాగా తనపని తాను సాధించుకొనేవాడని ఎగతాళిచేసేవారు. కొందరు అతనిపై అపానవాయువు వదిలేవారు. కొందరు పెంపుడు జంతువులాగా అతనిని బంధించేవాళ్ళు.

ఈ విధంగా ఆ సన్న్యాసి భౌతిక, దైహిక, దైవికమైన కష్టాలన్నీ దైవనిర్ణయాలని అనుభవించాడు. దుర్జనులు ఎన్నిరకాలుగా అవమానించినా సాత్త్వికధైర్యంతో స్వధర్మాన్ని వదలక ఈ విధంగాపాడాడు.

బ్రాహ్మణుడు :- నా సుఖదుఃఖాలకు మనుష్యులుగాని, దేవతలుగాని, ఆత్మగాని, గ్రహాలుగాని, కర్మలుగాని, కాలుగాని యేవీ కారణాలు కావు. సంసారచక్రాన్ని తిప్పేమనస్సే కారణం అని పెద్దలు చెప్తున్నారు. బలమైన మనస్సే గుణాలను పుట్టిస్తున్నది. ఆ గుణాల నుండే శుక్ల, కృష్ణ, లోహితాలైన విలక్షణ కర్మలు పుడుతున్నవి. ఆ కర్మలవలన సవర్ణాలైన దేవతిర్యక్ మానవాది గతులుపుడుతున్నాయి.

హిరణ్మయుడు క్రియాశీలకమైన మనస్సుతో గూడ నున్నవాడైనా స్వయంగా ఏమీ చేయకుండా సాక్షిగా చూస్తుంటాడు. జీవాత్మ సంసారద్యోతకమైన మనస్సును ఆత్మరూపంతో గ్రహించి మనస్సుకు సంబంధించిన పనులతో కూడిన వాడై భోగాలనుభవిస్తూ సంసారాసక్తుడౌతాడు. దానం, స్వధర్మం, నియమం, యమం, శ్రుతం, సద్వ్రతాలు, సత్కర్మలు ఇవన్నీ మనోనిగ్రహానికి ఉపాయాలు. మనోనిగ్రహమే పరమయోగం. సమాహితం, ప్రశాంతం అయిన మనస్సు గలవానికి దానాదుల వల్ల ప్రయోజనం లేదు. అలసత్వానికి వశమై నియమితం కాని మనస్సు కలవానికి కూడా దానాదులవల్ల ప్రయోజనం లేదు. అన్ని

ఇంద్రియాలు మనస్సునకు వశమై వున్నాయి. మనస్సు ఏ ఇంద్రియానికి వశమై లేదు. మనస్సు చాలా బలీయమైనది. యోగులకు భయంకరమైనది. దీనిని వశం చేసికొన్నవాడు జితేంద్రియుడు. సహించలేని రాగాది వేగంతో కూడినది, దేహాన్నే కాకుండా మర్మస్థానాలను కూడా బాధించేది, జయించడానికి వీలుకానిదయిన మనోరూప శత్రువును జయించ లేక కొందరు మనుష్యులు అనవసరంగా ఇతరులతో విరోధిస్తున్నారు. ఈ విరోధంలో కొందరు శత్రువులని కొందరు మిత్రులని, కొందరు ఉదాసీనులని చెప్తారు. ఇటువంటివాళ్ళు మూఢులు. మనుష్యులు అవివేకులై ఈ శరీరాన్ని నాది, నేను అని అనుకుంటున్నారు. కాబట్టి ఇది వేరే అని భ్రమలో పడి భవసాగరంలో తిరుగుతున్నారు. సుఖదుఃఖాలకు మనిషే కారణం. కర్తృత్వభోక్తృత్వాలు స్థూలసూక్ష్మ దేహాలకు సంబంధించినవి. ఏదైనా తినేటప్పుడు పళ్ళునాలుకను కొరికితే దానివల్ల బాధకలిగినపుడు ఎవరిపై కోపగించుకుంటాడు? అందువల్ల తనసుఖదుఃఖాలకు తానే కారణమవుతాడు. దుఃఖానికి ఆత్మే కారణం కాని దేవతలు కారు. కర్తృత్వభోక్తృత్వాలు ఇంద్రియాభిమానులైన దేవతలకు సంబంధించినవి. ఈ దేవతలు అన్ని దేహాల్లోను ఒకేవిధంగా వుంటారు. కాబట్టి తన దేహంలో ఒక అవయవం వల్ల ఇంకొక అవయవానికి దెబ్బ తగిలితే ఎవరిపై కోపించాలి. ఆత్మే సుఖదుఃఖాలకు కారణం. వేరే వాటిని నిందించనవసరం లేదు. ఆత్మ కన్నభిన్నమైందిలేదు. ఒకవేళవున్నా అదిమిథ్యే. సుఖంగాని దుఃఖంగాని లేకపోతే కోపానికి కారణమే వుండదు. గ్రహాలు సుఖదుః ఖాలకు కారణమైతే జన్మరాహిత్యమైన ఆత్మకేమినష్టం? వాటి ప్రభావం జననమరణశీలమైన శరీరంపై వుంటుంది. జ్యోతిష్యులు ఆకాశంలో వుండే గ్రహాలవల్ల శరీరంలో వుండే గ్రహాలకంటె భిన్నుడైన పురుషునిపై కోపం చూపించడమెందుకు? కర్మలె సుఖదుఃఖాలకు కారణాలైతే దానివల్ల

ఆత్మకేమిలాభం? జడత్వాజడత్వాలలో కర్మపుడుతుంది. దేహం జడం, పురుషుడు సుపర్ణుడు అంటే శుద్ధజ్ఞాన స్వరూపుడు. అందువల్ల సుఖదుః ఖాలకు మూలభూతమైన కర్మేలేనపుడు ఎవరిపై కోపించాలి? సుఖదుః ఖాలకు కాలముకారణం, ఆత్మకాలాత్మకం. కాబట్టి ఆత్మపై కాలప్రభావముంటుంది. అగ్నికి వేడి, మంచుకు శీతలం వుండదు. ఈ పురుషునికి సుఖదుఃఖాల్లేవు. కా బట్టి ఎవరిపై కోపించాలి? సంసారానికి సూచకమైన అహంకారానికి సుఖదుఃఖసంబంధముంది. అట్లు ప్రకృతికంటె అతీతమయిన ఆత్మకెప్పుడు దేనితోను సంబంధ ముండదు. ఈ విషయం తెలిసికొన్న మనిషి భూతాలకు భయపడదు. కాబట్టి నేను పురాతన ఋషులచే చెప్పబడిన ఈ పరమాత్మజ్ఞానాన్ని పొంది శ్రీకృష్ణపాదపద్మసేవతోనే కష్టము, అంధకారమయం అయిన సంసారాన్ని తరిస్తాను.

భగవంతుడు :- పోగొట్టుకున్న డబ్బు కలవాడు, భేదం లేనివాడు అయిన ఆముని విరాగియై సన్న్యసించి భూమండలమంతా తిరుగుతూ దుష్టులచే తిరస్కరింపబడ్డా తన ధర్మాన్ని వీడక ముందు చెప్పిన కథను పాడాడు. మనిషికి సుఖదుఃఖాలు కలగచేసే వారెవ్వరూ లేరు. ఇది అతని ఆత్మభ్రమ. మిత్ర, ఉదాసీన, శత్రురూపమైన ఈ సంసారమే అజ్ఞాన కల్పితము. ఉద్ధవా! మనస్సును నిగ్రహించి నాపై నిలుపు. అదే యోగసారమని తెలుసుకో. భిక్షుకునిచే పాడబడిన నీబ్రహ్మజ్ఞాన తత్త్వాన్ని ఏకాగ్రతతో చదివినా, విన్నా, వినిపించిన సుఖదుఃఖాలకు వశ్యుడుకాడు.



## పంథొమ్మిదవ అధ్యాయము

భగవంతుడు :- ఉద్ధవా! పూర్వం ఋషులు చెప్పిన సాంఖ్యయోగం నీకు చెప్పాను. దానిని విని పురుషుడు సుఖదుఃఖాది భేదమూలకమైన భ్రమను వదిలేస్తాడు. కృతయుగంలో అయినా, ప్రళయసమయంలో అయినా తెలివైన వాళ్ళుంటారు. అప్పుడే సమగ్రవిజ్ఞానం, నిఖిల జ్ఞేయ విషయం వికల్పశూన్యమై ఒకే రూపంలో వుంటాయి. అంటె పరబ్రహ్మ ఒక్కడే వుంటాడు, తర్వాత మాటలకు, మనస్సుకు కనపడనిది. భేదం లేనిది ఏకం సత్యం అయిన ఆబ్రహ్మ మాయారూపాలతో ప్రకృతి, అప్రకృతి, అని రెండురకాలు. ఇంకొక అంశం జ్ఞానం. అదే పురుషుడనే పేరుతో గుర్తింపబడుతున్నది. నావల్ల ప్రకృతికి క్షోభకల్గి తద్ద్వారా సత్త్వరజస్తమోగుణాలు ప్రకటింపబడ్డాయి. ఈ మూడింటినుండి క్రియాసంపన్నమగు సూత్రం, ఈ సూత్రం తో కూడ జ్ఞాన శక్తి ప్రధానమైన మహత్తత్త్వం, దానిద్వారా అహంకారం పుడుతున్నది. అహంకారం మూడు రకాలు వైకారికం, తైజసం, తామసం అదే చిదచిన్మయంగా, తన్మాత్రలకు, ఇంద్రియాలకు, మనస్సుకు కారణమైవుంది. పంచతన్మాత్రలకు కారణమైన తామసాహంకారం నుండి పంచమహాభూతాలు, తైజసాహంకారం నుండి పది ఇంద్రియాలు, వైకారికాహంకారం నుండి పదకొండు ఇంద్రియాధిష్ఠాన దేవతలు, మనస్సు కలిగినవి. నాచే ముందు చెప్పబడిన పదార్థాలన్నీ సమ్మిళిత భావంతో క్రియాశీలాలై ఉత్తమమైన నా నివాసస్థానరూపమైన బ్రహ్మాండాన్ని సృష్టించాయి. వీటిలో వున్న ఆ అండంలో నారాయణ స్వరూపుడనైన నేను వ్యక్తమయ్యాను. నా బొడ్డు నుండి ప్రపంచమనే పద్మం పుట్టింది. దానిలో బ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మ నా అనుగ్రహంవల్ల తపస్సు చేశాడు. దాని ప్రభావంతో లోకపాలకులతో గూడ భూర్భువ స్వర్లోకాలను సృష్టించాడు.

భూలోకం మనుష్యులకు, భువర్లోకం భూతగణాలకు, స్వర్గలోకం దేవతలకు నివాసయోగ్యమైనాయి. ఈ మూడు లోకాలకంటె శ్రేష్ఠమైన మహర్లోకాదులు సిద్ధులకాశ్రయమైనాయి. బ్రహ్మ రాక్షసులకు, నాగులకు నివాసస్థానాలుగా అతలాది లోకాలు సృష్టించాడు. త్రిగుణమయములైన కర్మలను బట్టి జీవులకు మూడులోకాలలో వివిధగతులుంటాయి. యోగం, తపస్సు, సన్న్యాసముల భేదాన్ని బట్టి మహర్లోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకం అనే ఉత్తమగతులను పొందుతారు. భక్తియోగం ద్వారా నా ధామాన్ని పొందుతారు. ఈ ప్రపంచం కాలాత్మకుణ్ణి, పరమేశ్వరుణ్ణి అయిన నాచేకర్మయుక్తమైంది. త్రిగుణాత్మక ప్రవాహవిశిష్టమైన ఈ సంసారంలో జీవుడు మునుగుతూ తేలుతూవున్నాడు. అంటే ఒకసారి అధోగతిని, ఒకసారి ఉత్తమగతిని పొందుతున్నాడు. ప్రపంచంలో చిన్న, పెద్ద, సన్న, లావు అయిన అన్ని పదార్థాలు ప్రకృతి పురుషులనుండి పుట్టినవే. ఏ పదార్థం యే కార్యానికి కారణం, లయస్థానం అయివున్నదో ఆ పదార్థమే ఆ కార్యానికి ఇప్పటి స్వరూపమై వుంది. తైజనపార్థివములైన పదార్థములు అంటె కటకకుండలాదులు, ఘటశరావాదులు కేవలం వ్యావహారిక పదార్థాలైనట్లు వైకారిక పదార్థాలన్ని వ్యావహారికాలె. కాని కారణ పదార్థమొక్కటె సత్యమైంది. ఉపాదాన కారణరూపంగా గ్రహించబడి, మహత్తత్త్వం మొదలైన అహంకారాది భావపదార్థాలనన్నింటిని సృష్టించే వస్తువే సత్యం. ఎప్పుడే పదార్థం వేటికి ఆద్యంతమని గ్రహింపబడిందో, అప్పుడాపదార్థం సత్యమైనదని చెప్పబడింది. ఈ జగత్కార్యానికి ఉపాదానమైన ప్రకృతి, ప్రకృతికి అధిష్ఠాత అయిన పురుషుడు, గుణక్షోభం వల్ల అభివ్యంజకమైన కాలము ఈ మూడు పదార్థాలు బ్రహ్మ స్వరూపుడనైన నేనే. నాకంటె వేరైనది లేదు.

భగవంతుని చూపువున్నంతవరకు గుణప్రభావంచే వివిధ

భావాపన్నులైన జీవులభోగం కోసం పితృ పుత్రాది రూపంతో ఈ సృష్టి చక్రం సదా తిరుగుతున్నది. కాలాత్మకుడనైన నాద్వారా వ్యాపింపబడి లోకాలసృష్టి స్థితిప్రళయాలకు ఆధారస్వరూపమైన బ్రహ్మాండం లోకాలన్నింటితోపాటు నాశరూప విభాగానికి యోగ్యం అవుతుంది. ప్రళయకాలంలో మానవశరీరాలు అన్నంలో, అన్నం విత్తనాలలో, విత్తనాలు భూమిలో, భూమి గంధ తన్మాత్రాలలో కలిసిపోతాయి. గంధం నీటిలో నీరు తనగుణమైనరసంలో, రసం తేజస్సులో, తేజస్సురూపంలో లీనమవుతాయి. రూపం వాయువులో, గాలి స్పృశించుటలో, స్పర్శము ఆకాశంలో, ఆకాశం శబ్దతన్మాత్రములో లీనమవుతాయి. ఇంద్రియాలు వాటికి కారకులైన దేవతలలో లీనమవుతాయి. దేవతలు నియంత్రణ కలిగిన మనస్సులో, మనస్సు అహంకారంలో, శబ్దము పంచభూతాలకు కారణమైన తామసాహంకారంలో మొత్తం ప్రపంచానికి మోహాన్ని కలిగించుటలో సమర్థమైన మూడు అహంకారాలు మహత్తత్త్వంలో లీనమవుతాయి. జ్ఞాన క్రియాశక్తి ప్రధానమైన మహత్తత్త్వంలో లీనమవుతాయి. జ్ఞానక్రియాశక్తిప్రధానమైన మహత్తత్త్వం తనకు కారణములైన గుణాలలో కలిసిపోతుంది. గుణములు అవ్యక్త ప్రకృతిలో, ప్రకృతి తనకు ప్రేరకం నాశంలేనిది అయిన కాలంలో కలిసిపోతాయి. కాలము మాయామయుడైన జీవునిలో, జీవుడు అజుణ్ణి, ఆత్మస్వరూపుణ్ణి అయిన నాలో కలిసిపోతాడు. జగత్తుయొక్క సృష్టిస్థితి నాశాలకు కారకుణ్ణి, నిరుపాధికుణ్ణి అయిన నేను ఇంకెక్కడ లయంకాను. నాలోనే వుంటాను. సూర్యోదయం తర్వాత చీకటివుండదు. ఆవిధంగానే యోగాన్ని గురించి ఆలోచించే వాడికి ప్రాపంచికభ్రమ కలగదు. ఒకవేళ కలిగినా ఎక్కువకాలం వుండదు. ఉద్ధవా! సర్వకార్యకారణతత్త్వ దర్శినైన నేను సృష్టిప్రళయ క్రమంతో సంశయగ్రంథిభేదకమైన ఈ సాంఖ్యవిధిని గురించి చెప్పాను.

## ఇరవయ్యవ అధ్యాయము

భగవంతుడు :- ఉద్ధవా! విభజింపదగిన గుణాలలో ఏగుణంవల్ల ఏరూపంలో ఎవడు వుంటాడో అతణ్ణి గురించి చెప్తా విను. శమం, దమం, సహనం, తెలివి, తపస్సు, సత్యం, దయ, స్మృతి, సంతోషం, త్యాగం, వైరాగ్యం, శ్రద్ధ, లజ్జ, దయాది సద్గుణాలు, ఆత్మరతి మొదలైనవి సత్త్వగుణవృత్తులు. కాయం, ప్రయత్నం మదం, తృష్ణ, గర్వం, భేదబుద్ధి, సుఖం, మదోత్సాహం, పరిహాసం, పరాక్రమం, కీర్తియందుకోరిక, దేవతలనుండి డబ్బుమొదలైనవి అడుక్కొనుట మొదలైనవి రజోగుణవృత్తులు.

క్రోధం, లోభం, అబద్ధాలాడటం, హింస,యాచన, దంభం, శ్రమ, కలహం, శోకం, మోహం, విషాదం, ఆర్తి, నిద్ర, ఆశ, భయం, జాడ్యం మొదలైనవి తమోగుణవృత్తులు. ఇంతవరకు వేరుగ వుండే సత్త్వరజస్తమోగుణాలను వివరించాను. ఇప్పుడు కలిసివున్న గుణవృత్తులను గురించి చెప్తా విను.

జీవులకు వుండే నేను, నాది అనే బుద్ధి మూడుగుణాలకు సంబంధించింది. మనస్సువల్ల, శబ్దాది విషయాలవల్ల, ఇంద్రియాలవల్ల, ప్రాణాలవల్ల పైన చెప్పబడిన వృత్తులు బయటపడతాయి. ఇవన్నీసాత్త్విక రాజస తామస గుణాలే. మనిషి ధర్మార్థ కామవిషయాలలో ఆసక్తుడయ్యేటప్పుడు వానికి శ్రద్ధను, రతిని, ధనాన్ని కలిగించేది ఈ మూడు గుణాల మిశ్రవృత్తే అని తెలుసుకో, కామ్యకర్మాదులలో పురుషుడికాసక్తి కలిగినపుడు గృహస్థాశ్రమంలో లీనమవుతాడు. తర్వాత తనపనులలో లీనుడవుతాడు. ఇది కూడ గుణత్రయ సమ్మిశ్రణమే. శమదమాది లక్షణాలతో పురుషుని సత్త్వగుణం కలవానిగా, కామాది లక్షణాలతో

రజోగుణం కలవానిగా, క్రోధలోభాది లక్షణాలతో తమోగుణం కలవానిగా గుర్తించాలి, ఫలితాన్ని కోరకుండ భక్తితో వాళ్ళపనులతో నన్నే సేవించే పురుషుని గాని, స్త్రీనిగాని సత్త్వప్రకృతిగలవారని తెలుసుకో విషయాలకోసం నన్ను సేవించే వానిని రజోగుణ ప్రకృతికలవాడనీ, హింస చేయాలని నన్నారాధించే వానిని తమోగుణ ప్రకృతి కలవాడని తెలుసుకోవాలి.

సత్త్వరజస్తమోగుణాలు జీవుని మానసిక గుణాలేకాని నావికావు. ఈ గుణాలవల్ల జీవుడు దేహదైహికాది పదార్థాలలో ఆసక్తుడై సంసారంలో చిక్కుకుంటాడు.

ప్రకాశించేది, స్వచ్ఛమైనది, శాంతమైనది అయిన సత్త్వగుణం రజోగుణ తమోగుణాలను గెలిచినపుడు పురుషుడు సుఖధర్మజ్ఞానాదులతో కూడి వుంటాడు. సంగహేతువు, భేదహేతువు, ప్రవృత్తిస్వభావం గల రజోగుణంతమస్సత్త్వములను జయించినప్పుడు మానవుడు దుఃఖముతోను, కర్మ, యశస్సు, శ్రీ మొదలైన గుణాలతో కూడి వుంటాడు. మూఢం, లయం, జడం అయిన తమోగుణం సత్త్వరజోగుణాలను జయించినపుడు మానవుడు శోకం, మోహం, నిద్ర, హింస, ఆశ మొదలైన గుణాలతో కూడి వుంటాడు.

చిత్తం నిర్మలం, ఇంద్రియాలు ప్రశాంతం, దేహం భయశూన్యం, మనస్సు విషయ సాంగత్యరహితం అయినపుడు నన్ను చేరుటకు అధిష్ఠాన భూతమైన సత్త్వగుణం ఉద్రిక్తమైందని తెలుసుకో కర్మలచేత వికృతుడు, విక్షిప్తచిత్తుడు అయిన జీవుని బుద్ధీంద్రియాలు దుఃఖాన్ని, కర్మేంద్రియాలు వికారాన్ని, మనస్సు చాంచల్యాన్ని పొందుతాయి. అప్పుడీ అన్ని కారణాలచేత రజోగుణం ఉద్రిక్తమైందని తెలుసుకో సత్త్వగుణం పెరిగినపుడు దేవతలకు, రజోగుణం పెరిగినపుడు అసురులకు, తమోగుణం పెరిగినపుడు రాక్షసులకు బలం పెరుగుతుంది. సత్త్వగుణం ఉద్రిక్తమైనపుడు జీవులకు జాగరణ,

రజోగుణం ఉద్రిక్తమైనపుడు స్వప్నం, తమోగుణం ఉద్రిక్తమైనపుడు సుషుప్తి కలుగుతాయి. పై మూడు అవస్థలలో తురీయావస్థ ఆత్మతత్త్వ రూపంలో వుంటుంది. సత్త్వగుణం చేత బ్రాహ్మణులు పైలోకాలకు వెళతారు. రజోగుణమయులు మానవలోకాన్ని పొందుతారు. తమోగుణమయులు స్థావరపర్యంతం అధోగతిని పొందుతారు. సత్త్వగుణం పెరిగినపుడు చనిపోయిన వాళ్ళు నరలోకానికి, తమోగుణం పెరిగినపుడు చనిపోయిన వాళ్ళు నరకానికి పోతారు. నిర్గుణులైనవారు జీవించేటప్పుడే నన్ను పొందుతారు. నాకు ప్రియం కలిగించే అభిప్రాయంతో చేసే పనులు, ఫలాపేక్ష లేకుండా చేసే కర్మలు సాత్త్వికాలు. ఫలాన్నపేక్షించి చేసేపనులు రాజసాలు. హింసతో కూడినవి తామసాలు.

కైవల్య జ్ఞానం అంటె దేహాదివ్యతిరిక్తమైన ఆత్మవిషయకజ్ఞానం దీనిని సాత్త్వికం అంటారు. వైకల్పిక జ్ఞానం అంటె దేహాదివిషయకజ్ఞానం దీనినే రాజసం అంటారు. ప్రాకృతజ్ఞానం తామసం. పరమేశ్వరనిష్ఠమైన జ్ఞానాన్ని నిర్గుణం అంటారు. వనవాసం సాత్త్వికం, గ్రామవాసం రాజసం, జూదగృహవాసం తామసం, నాధామంలో వుండడం నిర్గుణమని చెప్పబడుతున్నది. ఆసక్తిలేకుండా పని చేసేవాడు సాత్త్వికుడు. ఆసక్తితో పనిచేసేవాడు రాజసికుడు విచక్షణారహితంగా పనిచేసేవాడు తామసికుడు. కేవలం నన్నాశ్రయించి పనులు చేసేవాడు నిర్గుణుడు. ఆధ్యాత్మికమూ, శాస్త్రోక్తమూ అయిన శ్రద్ధ సాత్త్వికం, కర్మకాండలో శ్రద్ధరాజసం. అధర్మంలో శ్రద్ధ తామసం, నన్ను సేవించుటలో శ్రద్ధ నిర్గుణం అని చెప్పబడింది. మేలైనది, శుద్ధమైనది అయాచితంగా దొరికింది అయిన ఆహారాన్ని సాత్త్వికమంటారు. ఇంద్రియాలకు సుఖాన్ని కలిగించే వగరు, పులుపు, ఉప్పు కలిగిన వస్తువులు రాజసికాలు. దైన్యమైనవి అపవిత్రమైనవి అయిన

పదార్థాలు తామసాలు. నాకు నివేదించినవి నిర్గుణాలు అని చెప్పబడ్డాయి.

ఆత్మానుభవం వల్ల కలిగే సుఖం సాత్త్వికం, విషయాలవల్ల కలిగే సుఖం రాజసం, మోహ దైన్యాలవల్ల కలిగే సుఖం తామసం, నన్ను కీర్తించడం వల్ల కలిగే సుఖం నిర్గుణం

ద్రవ్యం, దేశం, ఫలం, కాలం, జ్ఞానం, కర్మ, కర్త,శ్రద్ధ, అవస్థ, ఆకృతి, నిష్ఠమొదలైనవన్నీ త్రిగుణాత్మకాలే. పురుషర్షభా! చూడబడినవి, వినబడినవి, ఆలోచింపబడినవి అయిన భావాలు త్రిగుణాత్మకాలు, మనిషికి సంసారభావాలు గుణకర్మలవల్ల కలుగుతాయి. చిత్తమునుండి పుట్టిన గుణాలను జయించినవాడు భక్తియోగంవల్ల నిష్ఠుడై మోక్షాన్ని పొందుతాడు. కాబట్టి విచక్షణులైన జీవులు జ్ఞానవిజ్ఞాన సంభవక్షేత్రమైన దేహాన్ని పొంది, గుణములయందాసక్తిని వదలి నన్ను సేవించాలి. తెలివైనవాడు, అప్రమత్తుడు, జితేంద్రియుడు, విషయాలలో అనాసక్తుడై నన్ను సేవించాలి. సాత్త్వికద్రవ్యాలను సేవించడం ద్వారా రజస్తమోగుణాలను జయించాలి. తర్వాత శాంతమనస్కుడైన జీవుడు ఉపశమాత్మకమగు గుణముతో కూడినవాడై మిశ్రమసత్త్వ గుణాన్ని జయించాలి. తర్వాత గుణత్రయ విముక్తుడై లింగదేహాన్ని వదలి నన్ను పొందుతాడు.

ఈ విధంగా లింగశరీరం నుండి గుణాలనుండి ముక్తుడై జీవుడు బ్రహ్మస్వరూపుడనైన అనుభూతిచేత పరితృప్తుడౌతాడు. బయట విషయభోగంతో, లోపల విషయచింతనతో వ్యవహరించడు.



## ఇరవై ఒకటవ అధ్యాయము

భగవంతుడు :- నాలక్షణాన్ని తెలుసు కొనుటకు సాధనం ఈ శరీరం. నా పై భక్తి కల్గి ఆత్మస్థితుడను, పరమానందరూపుడను, పరమాత్మను అయిన నన్ను జీవుడు పొందుతాడు. గుణమయమైన జీవోపాధినుండి జ్ఞానం ద్వారా విముక్తుడైన పురుషుడు విషయాలు నిజాలు కావని, మాయా మాత్రాలని తెలుసుకొని ఒకవేళ విషయాలలో వున్నా మిథ్యాభూతాలని విషయాలలో ఆసక్తుడు కాడు. విషయభోగాలలో, పొట్టను పోషించు కోవడంలో ఆసక్తులైన వాళ్ళతో ఎప్పుడూ స్నేహం చేయకూడదు. ఎందుకంటె అటువంటివాళ్ళను అనుసరించేవాడు గుడ్డివానిని అనుసరించే గుడ్డివానిలాగా అంధకారంలో పడతాడు.

పురూరవ చక్రవర్తి ఊర్వశీవిరహంతో చాలా శోకించాడు. శోకం తొలిగినాక విరాగియై ఈ కథను పాడాడు. పురూరవుడు తనను వదలివెళ్ళిన ఊర్వశికోసం దిగంబరుడై పిచ్చివానిలాగా పరుగెడుతూ దుఃఖిస్తూ వుండెను. ఊర్వశి తన మనస్సును దోచుకొనగా పురూరవుడు ఎప్పుడూ తుచ్ఛములైన విషయాలనుభవిస్తూ తృప్తి పడలేకపోయాడు. ఈ విధంగా ఎన్నో సంవత్సరాలు అతను పగళ్ళు రాత్రుల రాకపోకలను గమనించలేదు.

పురూరవుడు:- కామంతో మూసుకు పోయిన నా మోహం చాలా విస్తరించింది. ఊర్వశి చేత కౌగిలించుకోబడిన నేను పగలు, రాత్రి రూపమైన నా వయస్సును గుర్తించలేక పోయాను. ఊర్వశి వల్ల మోసగించబడిన వాడనై నేను సూర్యుని ఉదయాస్తమానాలు గమనించలేక పోయాను. ఈ విధంగా ఎన్నిరోజులు సంవత్సరాలు గడిచినాయో కదా! ఆహా నామనస్సు ఎంత మోహమైనది. దాని వలన నరశ్రేష్ఠుణ్ణి, చక్రవర్తిని అయిన నేను స్త్రీల

చేతిలో కీలుబొమ్మనైనాను. నారాజ్యాధిపత్యాన్ని గడ్డిపోచలాగా వదలి పిచ్చివానివలె దిగంబరుడనై ఏడుస్తూ వెళ్ళిపోతున్న ఆ ఊర్వశి వెంటపడ్డాను. కాలితో తన్నబడిన గాడిదలాగా పోతున్న ఆ ఊర్వశి వెంటబడ్డాను. అటువంటి నాలో మాహాత్మ్యంగాని, కళగాని, నియంత్రణగాని ఎట్లుంటాయి? స్త్రీలచే అపహరించబడిన మనస్సుగలవాని విద్య, తపస్సు, సన్న్యాసం, అధ్యయనం, ఏకాంతవాసం అన్నీ వ్యర్థములే సర్వజన నియంతృత్వం కలిగియు ఆవులాగా, గాడిదలాగా స్త్రీకి వశుణ్ణయ్యాను. మంచి తెలుసుకోని వాడను, పండితుడనని అహంకరించేవాడను అయిన నావంటి మూర్ఖుడెవడున్నాడు? ఆహుతిచే అగ్ని శమించదు. ఇంకా పెరుగుతుంది. అదేవిధంగా చాలా సంవత్సరాలు ఊర్వశి అధరామృతాన్ని తాగిన నా కామం తృప్తిచెందలేదు. ఇంకాపెరిగింది. కులట అయిన స్త్రీ చేత అపహరించబడిన మనస్సును మరల్చుటకు ఆత్మారాములకు ఆరాధ్యుడైన విష్ణుభగవానుడు తప్ప ఇంకొకడు సమర్థుడు కాడు. ఊర్వశి తన తెలివైన మాటలతో నాకెంతో బోధచేసింది. అయినా ఇంద్రియాలు జయించలేని మతిలేని నాకు మనోగతమైన మోహమేమాత్రం పోలేదు. ఎవరైనా భ్రాంతివల్ల త్రాడును చూచి పాముగా భావిస్తే అది రజ్జు దోషంకాదు. ఆ విధంగా ఇంద్రియాలను జయించలేని నేను స్వతహాగా దోషిని.

మిక్కిలి చెడువాసన, శుచిలేనిది మలినమైనది అయిన స్త్రీ శరీరమెక్కడ? సుకుమారమూ, సౌందర్యమూ, సౌగంధ్యమూ అయిన పుష్ప గుణాలెక్కడ? కాబట్టి ఇదంతా అజ్ఞాన కృతమైన అధ్యాసమే. ఈ శరీరం తల్లి దండ్రులకు సంబంధించినదా? భార్యకు సంబంధించిన సంపదా? ఇది యజమాని కొన్న వస్తువా; అగ్నికి ఇంధనమా? లేదా కుక్కలకు గ్రద్దలకు ఆహారమా? ఏ విధంగా ఆలోచించినా దీనినెవరూ నిర్ణయించలేక

పోతున్నారు. మలమూత్ర విశిష్టం, అపవిత్రం అయిన స్త్రీదేహంపై ప్రజలు మోహాన్ని చూపిస్తారు. ఆహా! ఈ ముఖం ఎంత బావుంది? ముక్కు ఎంత చక్కగావుంది? నవ్వు ఎంత బావుంది అని వర్ణిస్తారు. చర్మం, మాంసం, రక్తం, స్నాయువు, మేధస్సు, మజ్జ, ఎముకలు, మలం, మూత్రం, చీము అనే వాటితో కూడిన శరీరమునందు రమించేవాళ్ళకు, మలమూత్రాదులలో వుండే క్రిములకు తేడా ఏముంది? కాబట్టి తెలివైన వాళ్ళు స్త్రీలతోను, స్త్రీలంపటులతోను ఎప్పుడూ స్నేహం చేయకూడదు. విషయేంద్రియ సంయోగముల వలన మనస్సు చపలత్వం పొందుతుంది కాని వేరే వాటి చేతకాదు. కనపడని వినపడని పదార్థాలవల్ల మనస్సు ఎప్పుడూ కలత చెందదు. అందువల్ల ఇంద్రియాలను నిగ్రహించు కొనిన వాని మనస్సు నిశ్చలమై శాంతంగా వుంటుంది. కాబట్టి ఇంద్రియాలద్వారా స్త్రీలతోను, స్త్రీలంపటులతోను స్నేహం చేయకూడదు. జ్ఞానేంద్రియాలు, మనస్సు అనే షడ్వర్గాలపైన జ్ఞానులకే విశ్వాసంలేదు. ఇక నాలాంటి వాళ్ళ విషయం చెప్పడమెందుకు?

భగవంతుడు:-పురూరవుడు ఈ విధంగా చెప్పి ఊర్వశీలోకాన్ని విడిచాడు. తర్వాత అతడు మనస్సులో పరమాత్ముడనైన నన్ను తెలుసుకున్నాడు. జ్ఞానం వల్ల మోహమంతా తొలగిపోయింది. మనస్సు శాంతిని పొందింది. కాబట్టి బుద్ధిమంతుడైనవాడు చెడుసహవాసం వదలి సత్సాంగత్యంతో ఆసక్తుడు కావాలి. సత్పురుషులు తమ ఉపన్యాసములలో మనుష్యుల మనస్సునకు విరుద్ధమైన ఆసక్తిని నాశనం చేస్తారు. సత్పురుషులు, నిష్కాములు, నాపై మనస్సు గలవారు, ప్రశాంతులు, సమదర్శులు, మమత్వబుద్ధిరహితులు, అహంకార శూన్యులు, అపరిగ్రహులు అయిన మహానుభావులు నాకథలను కీర్తిస్తారు. ఆ కథలు శ్రద్ధతో విన్న

మనుష్యులపాపాలు నశిస్తాయి. ఆదరంగా, శ్రద్ధగా నాలీలలను విన్నా కీర్తించినా మానవులు నాయందాసక్తి గలవారై నాభక్తిని పొందుతారు. అనంతగుణాలకు నిలయుడను, చిదానందమయుడను, పరబ్రహ్మ స్వరూపుడను అయిన నాపై భక్తి కలిగివున్న వానికి ఇంక పొందదగిన వస్తువేదీ లోకంలో లేదు. అగ్నిదేవునాశ్రయిస్తే చలి, భయం, చీకటి నాశనమౌతాయి. అలాగే సత్పురుషుల నాశ్రయిస్తే జీవునకు కర్మజడత్వం, సంసారభయం, సంసార మూలకమైన అజ్ఞానం నాశనం అవుతాయి. నీటిలో మునిగిన మనుష్యులు గట్టి పడవను ఆశ్రయించినట్లు భయంకరమైన ఈ సంసారసముద్రంలో మునుగుతూ తేలుతూ వున్న మానవులు శాంతమనస్కులు, బ్రహ్మవేత్తలు అయిన సత్పురుషులనాశ్రయించాలి. అన్నం ప్రాణులకు ప్రాణం, నేను ఆర్తులకు రక్షకుణ్ణి, ధర్మం పరలోకంలో మానవులకు ధనం, అదేవిధంగా సత్పురుషులు సంసారంలో భయపడేవాళ్ళకు పరమరక్షకులు. సూర్యోదయం మానవులకు వెలుగునిస్తుంది. సత్పురుషులు భగవంతుని దర్శించడానికి జీవులకు జ్ఞాననేత్రాలనిస్తారు. అటువంటి సత్పురుషులే దేవతలు, బంధువులు, ఆత్మ అయివున్నారు. నేనే స్వయంగా సత్పురుషుని రూపంలోవున్నాను.

ఈవిధంగా పురూరవుడు ఊర్వశిని చూడటానికి కోరికలేనివాడై మంచిస్నేహంవల్ల ముక్తసంగుడై, ఆత్మారాముడై ఈభూమిపై తిరిగెను.



## ఇరవై రెండవ అధ్యాయము

ఉద్ధవుడు :- ప్రభో! ఏ భక్తులు ఏ అధిష్ఠానం వల్ల ఏ విధంగా నిన్నర్చిస్తారో, నీ ఆరాధనరూపమైన ఆ క్రియాయోగాన్ని వివరించు. నారదుడు, వ్యాసుడు, దేవతలకాచార్యుడైన బృహస్పతి మొదలైన మహర్షులు నీ పూజయే మానవులకు మేలు చేస్తుందని చెప్తున్నారు. క్రియాయోగం తొలుత నీ ముఖం నుండి వెలువడింది. బ్రహ్మదేవుడు నీ నుండి గ్రహించి తన కుమారులైన భృగువు మొదలైన మహర్షులకు బోధించాడు. తర్వాత శంకరుడు పార్వతికి బోధించాడు. మాధవా! నీ ఉపాసనే అన్ని వర్ణాల వాళ్ళకు, అన్ని ఆశ్రమాలవాళ్ళకు, స్త్రీ శూద్రాదులకు సర్వశ్రేష్ఠమైన శ్రేయస్సాధనమని అనుకుంటున్నాను. కమలనయనా! విశ్వేశ్వరా! నీ భక్తులం అనురక్తులం అయిన మాకీ కర్మబంధం నుండి విముక్తిపొందే ఉపాయం చెప్పు.

భగవంతుడు :- ఉద్ధవా! అనంతము అపారము అయిన కర్మకాండకు అంతములేదు. కాబట్టి సంగ్రహంగా వర్ణిస్తాను. నా పూజవైదికం, తాంత్రికం, మిశ్రం అని మూడురకాలు. ఈ మూడురకాలలో పురుషుడు తనకిష్టమైన ప్రక్రియననుసరించి అర్చించాలి. త్రివర్ణాత్మకుడైన పురుషుడు తొలుత తన అధికారాన్ననుసరించి తగిన సమయంలో ఉపనయనసంస్కారాన్ని పొంది శ్రద్ధాభక్తులతో నన్నర్చించాలి. ఈ పద్ధతి చెప్తా శ్రద్ధగా విను. ద్విజుడు భక్తిసహితుడై విగ్రహాలలో, భూమిపై, నిప్పులో, సూర్యునిలో, నీటిలో, తన హృదయంలో శాస్త్రోక్తమైన ఉపచారాల ద్వారా కపటభావం వదలి తనకిష్టదేవుడైన నన్ను పూజించాలి. పురుషుడు పళ్ళుతోమి స్నానం చేయాలి. తర్వాత వైదిక, తాంత్రిక మంత్రాలద్వారా శరీరానికి మట్టిపూసుకొని స్నానం చేయాలి. తమకు విహితములైన వేదోక్తకర్మలనాచరించి మానవులు

భగవంతునిపై భక్తికలిగి కర్మపాశాలను తెంచే నా పూజ చేయాలి. శిలామయం, దారుమయం, లోహమయం, మట్టి చందనమయం, చిత్రమయం, ఇసుకమయం, మనోమయం, మణిమయం అని ఆ ప్రతిమ ఎనిమిది విధాలుగా శాస్త్రాలలో చెప్పబడింది. కదిలేది, కదలనిది అనే తేడాతో వుండే ప్రతిమయే భగవంతుడైన నాకు మందిరంగా వుంది. కదలని ప్రతిమను పూజించేటప్పుడు ప్రతిరోజు దానికి ఆవాహనవిసర్జనలుండవు. స్థిరత్వంలేని శిలలో కొన్ని చోట్ల ఆవాహనవిసర్జనలుంటాయి. కొన్నిచోట్ల వుండవు. స్థండిలమునందు రెండూ వుంటాయి. మృత్తికామయం, చిత్రముగాని ఇతర ప్రతిమను నీటితో స్నానం చేయించాలి. కాని పైన చెప్పబడిన రెండు ప్రతిమలను కేవలం తుడవాలి. ప్రసిద్ధ పదార్థములచేత ప్రతిమలలో నా పూజ జరుగుతుంది. నిష్కాముడైన భక్తుడు సులభంగా దొరికిన పదార్థములతో, భావనామాత్రంగా నన్ను పూజిస్తాడు. ప్రతిమలకు స్నానాలంకరణలు చేయించుట నాకు చాలా ఇష్టం. మట్టితో చేయించిన వేదికలపై పూజ చేయదలిస్తే ఆయా మంత్రాల ద్వారా అంగప్రధానదేవతలను యథాస్థానంలో పూజించాలి. అగ్నిని నేతితో తడిపిన నువ్వులతో, చరువు మొదలైన ద్రవ్యాలతో పూజించాలి. సూర్యునికి అర్ఘ్యాదిదానం ప్రియం. నీటిలో తర్పణాదులతో నన్నుపాసించాలి. భక్తుడు శ్రద్ధతో సమర్పించిన జలం కూడా నాకు ప్రియం.

భక్తుడు కానివాడు ఎన్ని పదార్థాలు సమర్పించినా నాకు సంతోషం వుండదు. భక్తుడు శ్రద్ధతో సమర్పించిన గంధధూప పుష్పదీప నైవేద్యాలకే చాలా సంతోషపడుతున్నాను. పురుషుడు శుద్ధుడై పూజాసామగ్రి తీసుకొని తూర్పుదిక్కున కొనలుండునట్లు దర్భాసనంపై తూర్పుకుగాని, ఉత్తరానికిగాని ప్రతిమకెదురుగా కూర్చొని పూజించాలి. అంగన్యాసకరన్యాసములు చేసి

తర్వాత విగ్రహమునందు మంత్రన్యాసం చేయాలి. చేతితో విగ్రహంపై వుండే నిర్మాల్యాన్ని తీసేయాలి. ప్రోక్షణార్థమై జలపూర్ణకుంభాన్ని యథావిధిగా చందన పుష్పాదులతో సంస్కరించాలి. ప్రోక్షణ పాత్రలోని నీటితో పూజాస్థానాన్ని పూజాద్రవ్యాన్ని, తన దేహాన్ని ప్రోక్షించి పాద్యాదులకై నీటితో నింపిన మూడు కలశాలను గంధపుష్పాదులతో అలంకరించాలి. పూజ చేసేవాడు పాద్యం, ఆచమనీయం, అర్ఘ్యం అనేవాటి కోసం స్థాపించిన మూడు పాత్రలను క్రమంగా హృదయమంత్రంతో శిరోమంత్రంతో, శిఖామంత్రంతో, గాయత్రీమంత్రంతో సంస్కరించాలి. తర్వాత దేహాన్ని కాష్ఠగతమైన గాలిచే శోధించి, ఆధారగతమైన నిప్పుతో కాల్చి, లలాటస్థితమగు చంద్రమండలంలోని అమృతప్లావనం ద్వారా మళ్ళీ అమృతమయంగా చేసి నాదాంతమున సిద్ధపురుషులు భావించినది, హృదయమనే కమలంలో వున్నది. సూక్ష్మాకారం, శ్రేష్ఠం అయిన జీవకళను అంటె శ్రీనారాయణమూర్తిని ధ్యానించాలి. ఆత్మరూపంచే చింతితమైన మూర్తి ద్వారా దేహం విస్తరించగా, దానిని మానసికోపచారములచేత పూజించి, తన్మయభావంతో ప్రతిమలలో నన్ను ఆవాహన చేసి స్థాపించాలి. తర్వాత మంత్రాలతో అంగన్యాసం చేసి నన్ను పూజించాలి. ధర్మజ్ఞానాలతో, నవవిధశక్తులతో నాకాసనాన్ని కల్పించి దానిలో కర్ణికచేత, కేసరాలచేత సముజ్జ్వలమైన అష్టదళపద్మాన్ని కల్పించాలి. భోగమోక్షసిద్ధికై వేదోక్తాలు తంత్రోక్తాలు అయిన రెండురకాల మంత్రాలద్వారా పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం మొదలైన ఉపచరాలను అర్పించాలి. నన్ను పూజించిన తర్వాత సుదర్శనాన్ని, పాంచజన్యాన్ని, గదను, ఖడ్గాన్ని, బాణాన్ని, ధనుస్సును, హలాన్ని, ముసలాన్ని, కౌస్తుభమాలను, శ్రీవత్సాన్ని పూజించాలి. తర్వాత ఎనిమిది దిక్కులలో నందుడు, సునందుడు, ప్రచండుడు, చండుడు,

ఇహపరలోకాలలో కావలసిన దానిని పొందుతాడు. స్తోమతవుంటె మంచి మందిరాన్ని నిర్మించి దానిలో నా ప్రతిమను ప్రతిష్ఠించాలి. అందమైన పుష్పోద్యానాలను నెలకొల్పాలి. పూజాయాత్రోత్సవాదులను జరపాలి.

పండుగ రోజుల్లో ప్రతిరోజూ పూజాదులు నిర్వహించుటకు భూమిని, అంగుళ్ళను, పురాలను, గ్రామాలను దానం చేసి నాతో సమానమైన ఐశ్వర్యాన్ని పొందుతాడు. విగ్రహప్రతిష్ఠచేత సార్వభౌమపదవిని, మందిరనిర్మాణం చేత త్రిలోకాధిపత్యాన్ని, పూజాదులచే బ్రహ్మలోకాన్ని ఈ మూడింటితో నాతో సమానత్వాన్ని పొందుతాడు. నిష్కామభక్తితో నన్ను అర్చించేవాడు నన్నే పొందుతాడు. వెనుక చెప్పిన విధితో నన్న పూజించేవాడు భక్తియోగాన్ని పొందుతాడు. స్వదత్తం లేక పరదత్తం అయిన దేవతావృత్తిని బ్రాహ్మణవృత్తిని హరించేవాడు కోట్లకొలది సం॥రాల వరకు మలాన్ని తినే పురుగులాగా పుడతాడు. దొంగతనం చేసేవానికి కలిగే ఫలితం అతనికి సహాయం చేసేవానికి, అతనిని ప్రేరేపించేవానికి, ఒప్పుకొనేవానికి చనిపోయిన తర్వాత లభిస్తుంది. ఈ పనులలో ఎవరిభాగం ఎక్కువగా వుంటె వాళ్ళకు దాని ఫలితం కూడా ఎక్కువగానే వుంటుంది.



## ఇరవైమూడవ అధ్యాయము

భగవంతుడు:– ప్రకృతి పురుషులతోపాటు ఒకటే అయిన ప్రపంచాన్ని చూస్తూ అంటె అంతర్యామి అయిన పరమాత్మచే నియంత్రితమైంది. అది తెలుసుకోవాలి. అన్యుల శాంతఘోరాదులైన స్వభావాలను కర్మలను నిందించుటగాని పొగడుటగాని చేయరాదు. ఇతరుల స్వభావాలను ఎవడు పొగడతాడో తిడతాడో వాడు అసత్యవాదియై స్వార్థంనుండి భ్రష్టుడౌతాడు. తైజసములు నిద్రనుపొందగా జీవుడు మాయను పోగొట్టుకొని మృత్యువును పొందుతాడు. అదేవిధంగా ద్వైతాభినివేశయైన పురుషుడు గూడ చాంచల్యాన్ని లయాన్ని పొందుతాడు. అవస్తువైనద్వైతంలో ఏది మంచిదేది చెడ్డది లేక ఎంతమంచిది ఎంత చెడ్డది అనే ప్రశ్నవుండదు. కాని మాటలతో చెప్పునవీ, మనస్సుతో ఆలోచించేవీ అయిన వస్తువులన్నీ మిథ్యాభూతాలే అని తెలుసుకోవాలి. ఛాయ, ప్రతిధ్వని, శుక్తి మొదలైన వాటిలో రజతాదుల అభ్యాసము మిథ్యయైగూడ భయమోహాద్యర్థకారకమగును. అలాగే దేహం మొదలైన ద్వైతవస్తువులన్ని మిథ్యఅయినప్పటికి చనిపోయేంతవరకు సంసారభయం కలిగిస్తాయి. ప్రభువు, విశ్వాత్ముడు ఈశ్వరుడు అయిన పరమాత్మ ఈ ప్రపంచాన్ని ఆత్మగా సృష్టిస్తున్నాడు.స్వయంగా సృష్టి అవుతున్నాడు. రక్షిస్తున్నాడు. కాపాడబడుతున్నాడు. హరిస్తున్నాడు. హరింపబడుతున్నాడు. కాబట్టి సృష్టింపబడ్డ పదార్థాలన్నీ స్వతంత్రాలు కావు. అంటె భగవంతుని కంటె వేరైనవి కావు. కాబట్టి ఆత్మలో నిరూపితమైన అధ్యాత్మికాది త్రిగుణమయత్వం మాయాకల్పితమైందని తెలుసుకో, నేను చెప్పిన ఈ జ్ఞానవిజ్ఞానయుక్తమైన వాక్యాన్ని తెలిసికొనినవాడు ఈలోకంలో సూర్యునిలా మెలుగుతాడు. అతడెవ్వరిని నిందించడు. పొగడడు. ప్రత్యక్షానుమానాలద్వారా, ఆత్మానుభూతిద్వారా, శాస్త్రంద్వారా, ఈ జగత్తు

ఉత్పత్తి వినాశశీలమైంది. మిథ్య అయినది అని తెలిసికొని నిస్సంగుడై ప్రపంచంలో సంచరించాలి.

ఉద్ధవుడు:- దేవా! ఆత్మ స్వతస్సిద్ధమైన జ్ఞానం చేతనం, దేహం జడం. కాబట్టి ఆత్మదేహముల రెండింటికి సుఖదుఃఖాద్యనుభవముండదు. అటువంటి సమయంలో ఈ సుఖదుఃఖాద్యనుభవముండదు. అటువంటి సమయంలో ఈ సుఖదుఃఖాద్యనుభవం ఎవరికి కనిపిస్తుంది? ఆత్మ నాశంలేనిది. రాగాది శూన్యమైనది. పాపపుణ్యాలులేనిది. అగ్నిలాగా ప్రకాశించేది. అవరణ శూన్యమైనది కాని దేహం కట్టెలాగా చలనంలేనిది. కాబట్టి ఈ రెండింటిలో దేనికి సుఖదుఃఖాద్యనుభవముంటుంది?

భగవంతుడు:- దేహేంద్రియప్రాణాలతో ఆత్మకు సంబంధ మున్నంతవరకు తెలివితక్కువవాళ్ళకు మిథ్యాభూతమైన ప్రపంచం గూడ సత్యంగానే స్ఫురిస్తుంది. కలలో మిథ్యాభూతమైన ప్రపంచం గూడ సత్యంగానే స్ఫురిస్తుంది. కలలో మిథ్యాభూతమైన వ్యాఘ్ర సర్పాది దర్శనం వలన కలిగిన భయాదులవలె విషయచింతనలో వ్యాకులమైన ఆత్మపక్షమున సంసారం మిథ్య అయిననూ అవివేకం వల్ల అది సత్యంగానే స్ఫురిస్తుంది. నిద్రబోయేవాడికి కల ఎన్నో అనర్థాలు కలగజేస్తుంది. కాని మేలుకొనిన వానికది ఎటువంటి మోహాన్ని కలుగచేయలేదు. శోకం, మోహం, హర్షం, భయం, కోపం, లోభం, స్పృహ, జననం, మరణం అనేవన్నీ అహంకార కార్యములు అంటే దేహాభిమాన కార్యాలేకాని ఆత్మకు సంబంధించినవి కావు. దేహాన్నీ, ఇంద్రియాలను,మనస్సును అభిమానించేవాడు, అంతరాత్మయు, గుణకర్మమూర్తియు సూత్రం, మహత్తత్త్వం అని చెప్పబడేవాడు అయిన జీవుడు కాలానికధీనుడై అజ్ఞానం వల్ల సంసారంలో పరిగెడుతుంటాడు. ఈ అహంకార బంధన స్వరూపమైన సంసారం నిజంగా

మూలములేనిదై అజ్ఞానం వల్ల అది గారడివానిలాగా చాలా రూపాలుగా వెల్లడియై మనోవాక్ప్రాణ శరీరకర్మలుగా మారుతుంది. ముని ఈ అహంకారాన్ని గురూపాసనచే లభించిన తీక్ష్ణమైన జ్ఞానఖడ్గంచే ఛేదించి వాసనాశూన్యమైన హృదయంతో భూమిపై తిరుగుతాడు.

ఆత్మానాత్మవివేకమే జ్ఞానం. వేదం, తపస్సు, ప్రత్యక్షం, ఐతిహ్యం, కాలం, హేతువు, అనుమానం అనే ఈ ప్రమాణాల ద్వారా ప్రపంచంయొక్క ఆద్యంతాలలో ఏది వుందో మధ్యలో గూడ అదేవుందని తెలుసుకోవాలి. కుండలాదిరూపంగా చేయబడిన బంగారం ఆ కటక కుండలాలు పుట్టకముందుగాని, నాశమైన తర్వాతగాని బంగారుగానే వుంటుంది. మధ్యలో మాత్రమే అది కటక కుండలాది పేర్లతో పిలవబడుతుంది. నిజానికి అది బంగారమే. అట్లే ప్రపంచానికి కారణభూతుడను నేనే. నాకంటె వేరైన విశ్వంలేదు.

జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలతో కూడిన మనస్సు అవస్థాత్రయానికి కారణభూతమైన సత్త్వరజస్తమమను గుణత్రయము అధ్యాత్మాధిభూతాధిదైవాలకు, మూడు గుణాలకు కార్యభూతమైన త్రివిధ జగత్తు అనే ఈ పదార్థమంతా ఏ తురీయచైతన్యం యొక్క అన్వయవ్యతిరేకం ద్వారా సిద్ధమైనదో ఆ సమాధి సాక్షియైన పరబ్రహ్మమే సత్యం. సృష్టికి ముందు లేనిది ప్రళయం తర్వాత కూడా వుండదు. వుండేటపుడు వేరుగా వుండదు. నామమాత్రంగా వుంటుంది. దేనినుండి ఏ పదార్థం పుడుతోందో, దేని చేత ప్రకాశింపబడుతోందో అదే దాని పరమార్థసత్యమని నా అభిప్రాయం. వికారమయమైన పదార్థమంతా లేకపోయినా వున్నట్లుగా అనిపించును. ఇది రాజస సృష్టి. ఇది స్వయంప్రకాశితమైన బ్రహ్మమే. కాబట్టి ఇంద్రియాలు, పంచతన్మాత్రలు, మనస్సు, పంచమహాభూతాలు

అనేవాటిచేత చిత్రింపబడిన ఈ ప్రపంచమంతా బ్రహ్మమే. వేదం, తపస్సు, ప్రత్యక్షం, ఉపదేశం, అనుమానం మొదలైన స్పష్టమైన బ్రహ్మజ్ఞాన కారణాలచేత, నిపుణుడైన గురువుచేత దేహాద్యనాత్మ భావాన్ని పోగొట్టుకొని ఆత్మానందం చేత సంతుష్టుడై కామపరతంత్రములైన ఇంద్రియ విషయాలనుండి ఉపరతుడు కావాలి. భౌతికమైన శరీరం ఆత్మకాదు. ఇంద్రియాలు వాటికధిష్ఠాతలైన దేవతలు, ప్రాణాలు, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనేవి శరీరం లాగా అన్యోన్యాశ్రయాలుగ వుండడం వల్ల అవి అన్నీవికారాలే కాని ఆత్మకావు. పంచభూతాలు, శబ్దాదివిషయపంచకం, ప్రకృతి ఇవన్నీ భౌతికాలే కావున ఆత్మస్వరూపాలు కావు. చక్కగా నాస్వరూపం తెలిసికొన్నవానికి వాని త్రిగుణమయాలైన ఇంద్రియాలు నిశ్చలాలైనా, విక్షిప్తాలైనా ఎటువంటి గుణంగాని దోషంగాని వుండదు. మేఘాలు ఆకాశాన్ని ఆవరించినా ఆవరించకపోయినా సూర్యుడికెటువంటి అభివృద్ధిగాని నాశంకాని కలగదు. పంచభూతాల గుణాలచేత, గతాగతాలైన శీతోష్ణాదుల చేత యుక్తంకానట్లు అహంకారం కంటె వేరైన పరమాత్మ ప్రపంచానికి కారణరూపాలైన సత్త్వాదిగుణాలచేత మలినుడు కాడు. అయినా దృఢభక్తిచేత విషయాలనుండి మనస్సు తొలగనంతవరకు మాయారచితాలైన విషయాలలో ఆసక్తిని పూర్తిగా వదలాలి. బాగా వైద్యం చేయకపోతే మనుష్యుల రోగాలు పూర్తిగా నాశనంకాక మళ్ళీమళ్ళీ వృద్ధిచెంది బాధ కలిగిస్తాయి. ఆ విధంగానే మనస్సులోని వాసనలు, వాటికర్మలు పూర్తిగా నశింపకపోతే భార్యా బిడ్డలయందు ఆసక్తమైన మనస్సు అల్పజ్ఞానంగల మానవుని స్వార్థంనుండి భ్రష్టునిగా చేస్తుంది. కుయోగులు దేవతాప్రేరితాలైన బంధుశిష్యాది రూపాలను ధరించిన ఆటంకాలచేత చెడిపోయిగూడ జన్మాంతర సంస్కారబలంచే మళ్ళీ యోగ పరిశీలనలో

